Photo by P. K. Patel



బహుమతి
పొందిన వ్యాఖ్య

తల మునిగి....

పంపినవారు :
బి. ఆంజనేయశాస్త్రి - తెనాలి

# చందమామ

## ఈ సంచికలో కథలు వింతలు - విశేషాలు

★



ఇవి గాక :
చిత్రకథ, ఫోటో శీర్షికల పోటీ, మొదలైన మరీ ఎన్నో ఆకర్షణలు.



# పిల్లలకోసం –
# ఇంకొక సులభమైన
# గిబ్స్ డెంటిఫ్రిస్
# రంగులు వేసే పోటీ
## ఆకర్షణీయమైన బహుమతులు



**మొదటి బహుమతి:**
రేలీ సైకిల్ . . .



**రెండవ బహుమతి:**
హెచ్ ఎమ్ వి గ్రామఫోన్



**మూడవ బహుమతి:**
వ్యూ మాస్టర్ ప్రొజెక్టర్ సెట్

### మరియు 100 ఆకర్షణీయమైన ప్రోత్సాహక బహుమతులు:

**ఈ బొమ్మకు రంగులు వేయండి:** ఇది ఎంతో సులభము, ఎంతో ఉత్సాహకరము! మరియు మీరు ఒక ఆకర్షణీయమైన బహుమతిని గెలుపొందవచ్చునుకూడ — మీరు పొందవలెనని ఎల్లప్పుడూ ఎంతో ఎక్కువ కోరికతోనున్న ఏదో ఒక వస్తువును. మీరు వాటర్ కలర్లు, రంగు పెన్సిలు లేక చాక్ లేదా మీకు లభించే మరియే ఇతర రంగులనైనా ఉపయోగించవచ్చును. మీరు దానిని చేతనైనంత సుందరముగా జేయండి. గిబ్స్ డెంటిఫ్రిస్ బిళ్ల యొక్క పైసెల్లోఫేన్ రేపర్ మీద నున్న ఒక గిబ్స్ ముద్రను చేర్చి — ఆ బొమ్మను మాకు పంపండి. మీకొక గిబ్స్ డెంటిఫ్రిస్ డబ్బీని నేడే కొనిపెట్టమని మీ అమ్మను అడగండి. దానిని ప్రతిరోజూ వాడండి! ముగ్గురు తీర్పరుల సంఘము అర్హతానుసారం ఏ బొమ్మలు శ్రేష్ఠమైనవో నిర్ణయింతురు. నేడే పాల్గొనండి!

**ఈ నిబంధనలను జ్ఞాపకముంచుకోండి: 1.** 14 ఏళ్ల వయస్సు మించనట్టిన్ని భారత దేశ నివాసులైయున్నట్టిన్ని ప్రతీ బాలుడుగాని, బాలికగాని ఈ పోటీలో పాల్గొనవచ్చును. **2.** మీ కిష్టమైనన్ని బొమ్మలను మీరు పంపవచ్చును; అయితే ప్రతీబొమ్మయున్నూ 'గిబ్స్ డెంటిఫ్రిస్ బిళ్లయొక్క పైసెల్లోఫేన్ రేపర్ మీద నున్న ఒక గిబ్స్ ముద్రను చేర్చి పంపబడవలెను. **3.** మీ బొమ్మలను గిబ్స్ డెంటిఫ్రిస్ కాంటెస్ట్, పోస్టుబాక్స్ నం, 10119 బొంబాయి—1' ఈ చిరునామాకు 1958 ఆగస్టు 30 వ తేదీ శనివారము మధ్యాహ్నం 1 గంటలోవుగా చేరునట్లు పంపండి. **4.** బొమ్మలు కంపెనీకి చేరకుండా మధ్యలో పోయినను, ఆలసింపబడినను, తప్పు స్థలమునకు పంపబడినను, లేదా చెడిపోయినను, అట్టి బొమ్మలకు కంపెనీవారు బాధ్యులుగారు. **5.** మొదటి, రెండవ, మూడవ, బహుమతులను .గెలుపొందినవారి పేర్లు నవంబరులో ఈ పత్రికయందు ప్రకటించబడును. ఇతర బహుమతులను

GD. 40A-50 TL




నా పేరు ..............................................

..............................................

చిరునామా ..............................................

..............................................

ఈ రంగులు వేయుట ఇతరుల సహాయత బొందని నా స్వయం కృషి యనిన్ని. నా.వయస్సు — అనిన్ని. నేను ప్రకటించుచున్నాను. చందమామ

గెలుపొందినవారికి పోస్టుద్వారా తెలుపబడును. **6.** ఒక పోటీ దారుడు ఒక్క బహుమతికి మాత్రమే అర్హుడై యుండును. **7.** తీర్పరుల నిర్ణయమే ఖాయమైనదిన్ని. బద్ధమైనదిన్ని. **8.** ఈ పోటీనిగురించి ఉత్తర ప్రత్యుత్తరములు జరుపబడవు.




# గిబ్స్ డెంటిఫ్రిస్

పళ్లను బాగుగా శుభ్రపరచును, ఎంతో మంచి రుచిగా నుండును, చాలా కాలము వాడుకొనవచ్చును !

GD 40B-50 TL

పిల్లలకోసం—

## గిబ్స్ డెంటిఫ్రిస్

రంగులు వేసే మొదటి పోటీ

బహుమతులను పొందినవారు :

1-వ బహుమతి : ఫిలిప్స్ రేడియో

టి. సదాశివ భట్టా,
పులేగార్, సారవంత్ పోస్టు,
సాగర్ (పశ్చిమ షిమోగా.)

2-వ బహుమతి : ఫేవర్‌లూబా రిస్టువాచి

ప్రతాప్‌సింగ్ దేవ్‌జీ,
సిక్కా ఫ్యాక్టరీ, మూగానీ.

3-వ బహుమతి : అగ్ఫా-ఐసొలా కెమెరా

రెకేష్ హూజా,
13, అలీపూర్ రోడ్డు, ఢిల్లీ.

ఇతర బహుమతులను పొందిన 100 మందికి తపాలుద్వారా తెలుపబడును.

లక్షలాది ప్రజలు ఉపయోగించి, వారి పరీక్షలో నెగ్గినవి.



# చాంపియన్

## బనియన్లు

★

తయారీలో, మన్నికలో
ఉత్తమోత్తమమైన విదేశీ
బనియన్లకు సమానమైనవి.

**CHAMPION**

చాంపియన్
నిట్టింగ్ కంపెనీ,
పోస్టుబాక్సు నం. 42, తిరుప్పూర్.

---

# ఏ రకపు ఆభరణాలైనా













గాజులుగాని కంఠహారములు కాని కంకణములుగాని, చెవి పోగులేగాని ముక్కుకాడలేకానీ—బంగారు ఆభరణాలు ఏవైనా సరే (సాదావి, నగిషీ చెక్కినవి, రత్నాలు పొదిగినవి), ఇవిగాక—వెండితో చేసిన డిన్నర్, టీ, కాఫీ లేక లెమన్‌సెట్లు—అనేక రకాలు, నమూనాలు సిద్ధంగా వున్నవి.........

కావాలంటే, మీ కొలతల ప్రకారం సరీగా తయారుచేసి యివ్వబడును.

అసమానమైన పనితనము.





జూన్ 19 తేది నుండి
ఆంధ్రప్రదేశ్ అంతటా
విజయవంతముగా ప్రదర్శింపబడుతూంది!
ఏ.ఎల్.ఎస్ ప్రొడక్షన్సు
సమర్పించు
పద్మిని పిక్చర్స్ వారి
బడి పంతులు
దర్శకత్వం:
బి.ఆర్.పంతులు
ARUNA
విజయ రిలీస్
స్టూడియో: భరణి



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ సంచికతో "చందమామ"కు పన్నెండో ఏడు అరంభమవుతున్నది. పాశ్చాత్యదేశాలవారు ఇంకా పదేళ్ళకు కృత్రిమ చందమామలను ప్రయోగిస్తారనగా మా చందమామలు పుట్టాయి. "స్పూత్నిక్"ల లాగా కాక మా చందమామలు నెలనెలా చేతికి అందుతూవుంటాయి; వాటి భాష అందరికీ తెలుస్తుంది. మా చందమామలు దీర్ఘజీవులుకూడా.

లోగడ జీవరాసులను గురించిన వివరాలు నాలుగేసి పేజీల చొప్పున ప్రకటిస్తూ వచ్చాము. ఈ సంచిక నుంచీ వాటికి బదులుగా "ప్రకృతి వింతలు" అన్న సీరియల్ ప్రచురిస్తున్నాము. దీనిని రచించినది తిబోర్ సెకెల్య్ అనే యుగోస్లావియా పరిశోధకుడు. ఈయన దక్షిణ అమెరికాలోని అదిమనివాసులతో చాలాకాలం జీవించి వారిని గురించి అనేక విషయాలు తెలుసుకున్నాడు. అయన నరభక్షకులవెంట కూడా కొంతకాలం వున్నాడు. ఆయనకు కలిగిన విచిత్రమైన అనుభవాలు ఈ రచనకు తోడ్పడ్డాయి.

ఈ రచన కథరూపంలో వున్నప్పటికీ ఇందులోని ఘటనలన్నీ రచయిత స్వానుభవాలే.

సంపుటి 23 ★ జూలై 1958 ★ సంచిక 1



# అట్ట వీది బొమ్మ

యుద్ధంలో తనకు సహాయం చెయ్యమని ధర్మరాజు ఆహ్వానాలు పంపిన వారిలో మద్రదేశపు రాజూ, నకులసహదేవుల మేనమామా అయిన శల్యుడొకడు. ఆయన తన అక్షౌహిణీ సేనతో, తన కుమారులతో, సేనాపతులతో ధర్మరాజును చేరవస్తూండగా ఆ వార్త దుర్యోధనుడికి తెలియవచ్చింది. ఆయనను తన పక్షానికి తిప్పుకునేటందుకు దుర్యోధనుడొక యుక్తి పన్నాడు.

అతను స్వయంగా పూనుకుని దారివెంట శల్యుడికి మజిలీస్థలాలలో అద్భుతమైన విడిది ఏర్పాట్లు చేయించి, ఆయనకూ ఆయన పరివారానికీ సమస్త సౌకర్యాలూ కలగజేశాడు. తనకీ ఇంద్రవైభోగం సమకూర్చుతున్నవాడు ధర్మరాజే అనుకుని శల్యుడు ఒకనాడు తన పరిజనులతో, "మనకీ సదుపాయాలు చేస్తున్న వారెవరు? వారికి కోరిన బహుమానం ఇయ్యదలిచాను," అన్నాడు.

ఈ వార్త తెలియగానే దుర్యోధనుడు శల్యుడి ఎదటకు వచ్చి, ప్రేమతో ఆలింగనం చేసుకుని, "మహాత్మా, మీరు నా సైన్యాలకొక సేనాపతిగా ఉండాలి. ఇదే నా కోరిక!" అన్నాడు, "ఆడినమాట తప్పను. నీ కోరిక ప్రకారం నీ సైన్యాలను నడుపుతాను. కాని ముందుగా నేనొకసారి పాండవులను చూసి రావాలి," అన్నాడు శల్యుడు. ఇందుకు దుర్యోధనుడు సమ్మతించి, హస్తినాపురానికి వెళ్ళిపోయాడు.

శల్యుడు ఉపప్లావ్యానికి వెళ్ళి పంచపాండవులను చూశాడు. ధర్మరాజు ఆయనకు స్వాగతమిచ్చి ఎంతో గౌరవించాడు. శల్యుడు ధర్మరాజును పరామర్శించి, "మాయాజూదంలో ఓడిపోయి మీరు పడరాని ఇక్కట్లు పడ్డారు. తిరిగి మీకు న్యాయం జరుగుతుంది. రాగల యుద్ధంలో మీకు జయం తప్పక సిద్ధిస్తుంది," అంటూ, తాను దుర్యోధనుడికి మాటఇవ్వటం గురించి చెప్పాడు.

"పెద్దలు అన్నమాట నిలబెట్టుకోవటం ధర్మమే. కాని మీరు నన్ను మన్నించి నా కోరిక ఒకటి నెరవేర్చాలి. యుద్ధంలో కృష్ణార్జునులు పోరాడుతారు. అర్జునుడికి కృష్ణుడు సారథి. కౌరవబలాలలో మిమ్మల్ని మించిన సారథి లేడు. అందుచేత మీరు కర్ణుడికి సారథ్యం చెయ్యవలసి వస్తుంది. అప్పుడు మీరు ఎలాగైనా అర్జునుడు గెలవటానికి తగిన సహాయం చేయాలి!" అని ధర్మరాజు శల్యుణ్ణి వేడుకున్నాడు. శల్యుడు అలాగే చేస్తానని ధర్మరాజుకు మాటఇచ్చాడు.



# తీరిన సందేహాలు

వింధ్యపర్వతప్రాంతంలో శంభుడని ఒక పేద యువకు డుండేవాడు. వాడు కొండ చరియలో కష్టపడి వ్యవసాయం చేసి ఏదో విధంగా తన ముసలి తల్లిని పోషిస్తూ వచ్చాడు. ఒకనాడు వాడికొక సందేహం కలిగింది : తన యీడువాళ్లు తనలాగే కష్ట పడి ధనవంతులవుతున్నారుగదా, తాను ఏడాది పొడుగునా కష్టపడినా తన పొట్టా, తన తల్లి పొట్టా ఎందుకు నిండదు?

ఆ ప్రాంతాల ఉండేవాళ్ళు, "అను మానం ఉంటే ఆంగీరస మహామునిని అడుగు!" అనటం ఆచారంగా ఉండేది. ఈ అంగీరస మహాముని నాసిక వద్ద కొండ లలో తపస్సు చేస్తూ ఉంటాడని చెప్పుకునేవారు.

శంభుడు తన అనుమానం గురించి ఆంగీరస మహామునిని అడగాలని నిశ్చ యించాడు. ఈ ఆలోచన తట్టగానే వాడు తల్లితో, "అమ్మా, నేను నాసికకు బయలు దేరి పోతున్నాను!" అని చెప్పాడు. తల్లి వద్దని ఎంత బతిమాలినా వినిపించుకోక వాడు నాసికకు బయలుదేరాడు.

పోగాపోగా ఒక నిర్జన ప్రాంతంలో వాడి కొక గుడిసె కనిపించింది. ఆకలిబాధ జాస్తిగా ఉండటంచేత శంభుడా గుడిసెలోకి వెళ్ళి, అందులో ఉండే అవ్వను, "అవ్వా, నాకింత అన్నం పెడతావా? దూరంనుంచి వస్తున్నాను!" అని అడిగాడు.

అవ్వ వాడికి అన్నం పెట్టి, "అయితే, నాయనా, నువు ఎక్కడికి పోతున్నావు? ఏం పనిమీద పోతున్నావు?" అని అడిగింది.

"నేను ఎంత కష్టపడినా నా దారిద్ర్యం ఎందుకు తీరదో ఆంగీరస మహామునిని అడగ బోతున్నాను," అన్నాడు శంభుడు.

"అయితే ఆయనను ఇంకొక విషయం కూడా అడుగు, బాబూ. నా మనమరాలు

ఆర్. మాణిక్యాంబ

పద్దెనిమిదేళ్ళది. చక్కని చుక్క. కాని అది ఎన్నడూ మాట్లాడి ఎరగదు. దానికి మూగతనం ఎలా పోతుందో కాస్త అడిగి వస్తావా ?" అన్నది అవ్వ.

శంభుడు సరేనని అక్కడనుంచి బయలు దేరి మళ్ళీ నడక సాగించాడు. పోగాపోగా ఒక ఊరి వెలపల వాడికొక ఇల్లు కనిపించింది. వాడా ఇంటి దగ్గిర ఆగి ఇంటి యజమానితో, "అయ్యా, దూరంనుంచి వస్తున్నాను. ఆకలిగా ఉంది. కాస్త అన్నం పెట్టిస్తారా ?" అని అడిగాడు.

ఆ ఇంటాయన శంభుడికి తనతోబాటు అన్నం పెట్టించి, "అయితే, నాయనా? నువు ఎక్కడికి పోతున్నావు? ఏం పనిమీద పోతున్నావు?" అని అడిగాడు.

"నేను ఎంత కష్టపడినా నా దారిద్ర్యం ఎందుకు తీరదో, నాసిక వద్దవున్న అంగీరస మహామునిని అడిగి తెలుసుకోబోతున్నాను," అన్నాడు శంభుడు.

"అలాగా? అయితే కాస్త నా విషయం కూడా అడుగుదూ! మా దొడ్లో చక్కగా నవనవలాడే నారింజ చెట్టుంది. ఎన్నాళ్ళు చూసినా ఒక్క పిందెకూడా పడకుండా ఉంది. అంగీరస మహామునిని అడిగి కారణం తెలుసుకు వస్తావా ?" అని అడిగాడు గృహస్థు.



సరేనని శంభుడు పోగాపోగా ఒక కీకారణ్యం మధ్య వాడికొక ఆశ్రమం తగిలింది. ఆ ఆశ్రమంలో ఉండే ముని దగ్గరికి వెళ్ళి శంభుడు, "స్వామీ, ఆకలిగా ఉన్నది, అన్నం పెడతారా ?" అని అడిగాడు.

ముని వాడికి భోజనం పెట్టి, "నువు ఎక్కడికి పోతున్నావు? ఏం పనిమీద పోతున్నావు?" అని అడిగాడు.

"నేను ఎంత కష్టపడినా నా దారిద్ర్యం ఎందుకు తీరదో అంగీరసమహామునిని అడిగి తెలుసుకోబోతున్నాను," అన్నాడు శంభుడు.

"అయితే ఆయనను నా అనుమానం కూడా ఒకటి అడుగుతావా ఏమిటి? ఎంతో కాలంగా నేను కొన్ని సిద్ధులకోసమై తపస్సు చేస్తున్నాను. కాని నా తపస్సు ఎంతకాలానికీ సిద్ధించకుండా ఉంది. కారణం తెలుసుకు వస్తావా ?" అన్నాడు ముని.

శంభుడు సరేనని బయలుదేరి చాలా రోజులు ప్రయాణం చేసి అంగీరసమహాముని ఉండే చోటు చేరుకున్నాడు.

ఆ మహాముని శంభుణ్ణి ఎంతో ఆదరంతో తన ఆశ్రమంలోకి తీసుకుపోయి, వచ్చిన పని అడిగాడు.

"మహాత్మా, నేను నాలుగు సందేహాలు తమరిని అడిగిపోదామని వచ్చాను," అన్నాడు శంభుడు.





"నాకు మూడు సందేహాలకన్న ఎక్కువ తీర్చే నియమం లేదు, నాయనా. నీ సందేహాలలో ఒకటి వదిలేసి మిగిలినవి అడుగు, వాటికి తగిన సమాధానాలు చెబుతాను," అన్నాడు అంగీరస మహాముని.

శంభుడు కాస్సేపు ఆలోచించి, అన్ని సందేహాలలోకీ తన సందేహమే చచ్చు సందేహమనే నిశ్చయానికి వచ్చాడు.

తరవాత వాడు మూగపిల్లను గురించీ, గృహస్థు దొడ్లోవున్న కాపులేని నారింజ చెట్టును గురించీ, సిద్ధించని ముని తపస్సును గురించీ, మహామునిని అడిగి ఆయనద్వారా సమాధానాలు తెలుసుకున్నాడు.

తరవాత వాడు ఇంటికి ప్రయాణమై మొదట ముని ఆశ్రమానికి వచ్చాడు. ముని ఆత్రంగా, "అంగీరసుడేమన్నాడు, నాయనా?" అని అడిగాడు.

"మీ తలలో ఏదో మణి ఉన్నదట. మీ తపశ్శక్తి యావత్తూ దానికే పోతున్నదిట. దాన్ని పెరికివేస్తే మీ తపస్సు తప్పక సిద్ధిస్తుందని అంగీరస మహాముని చెప్పాడు," అన్నాడు శంభుడు.

ముని ఆశ్చర్యంతో తన జడలమధ్య తడివి చూసుకుంటే చేతికి మణి తగిలింది. దాన్ని పెరికి ఆ మహాముని శంభుడి కిస్తూ, "దీన్ని నువే ఉంచుకో, నాయనా! ఇక



నేను సిద్ధులు సంపాదించుకుంటాను!" అన్నాడు సంతోషంగా.

శంభుడు మునివద్ద సెలవు పుచ్చుకుని గృహస్థు ఉండే చోటికి వచ్చాడు.

"నా అనుమానం సంగతి అంగీరస మహాముని ఏం చెప్పాడు, నాయనా?" అని గృహస్థు ఆత్రంగా శంభుణ్ణి అడిగాడు.

"మీ నారింజచెట్టుకింద తొమ్మిది బిందెలనిండా బంగారం ఉన్నదట. వాటిని పైకి తీస్తే చెట్టు చక్కగా కాస్తుందట!" అన్నాడు శంభుడు.

ఈ రహస్యం ఇతరులకు తెలియటం అంత మంచిదికాదని, ఆ గృహస్థు ఆ రాత్రి శంభుడి సహాయంతో నారింజచెట్టు అడుగున తవ్వాడు. నిజంగానే తొమ్మిది బంగారపు బిందెలూ దొరికాయి.

"నాయనా, నాకు చాలా ఉపకారం చేశావు. ఈ బిందెలలో ఒకటి నువు పట్టుకుపో!" అన్నాడు గృహస్థు.

ముని ఇచ్చిన మణినీ, గృహస్థు ఇచ్చిన బిందెనూ తీసుకుని శంభుడు అవ్వ ఉండే గుడిసె చేరుకున్నాడు.

"నా మనమరాలి విషయం అంగీరస మహామునిని అడిగావా, బాబూ? ఆయన ఏమన్నాడు?" అని అవ్వ ఆత్రంగా శంభుణ్ణి ప్రశ్నించింది.



"అడిగా నవ్వా! నీ మనవరాలికి నచ్చిన వరుడు కనబడగానే దానంతట అదే మాట వస్తుందని అంగీరస మహాముని చెప్పాడు!" అన్నాడు శంభుడు.

సరిగా ఆ క్షణంలోనే అవ్వ మనమరాలు అక్కడికి వచ్చింది.

శంభుణ్ణి చూడగానే ఆ పిల్ల చెక్కిళ్ళు సిగ్గుతో ఎర్రబడ్డాయి. ఆమె అవ్వతో, "ఈయన ఎవరు, అమ్మమ్మా!" అన్నది.

అవ్వ ఆశ్చర్యంతో నిర్ఘాంతపోయి, "నిజంగా నీ నోట మాట వచ్చిందా, నా తల్లీ! అయితే ఈ అబ్బాయే నీ మొగుడు! మీ ఇద్దరికీ ఇవాళే పెళ్ళి చేయిస్తాను!" అన్నది ఆనందంతో.

ఆ ప్రకారమే శంభుడు ఆ పిల్లను పెళ్లాడి ఆమెనూ, బంగారపు బిందెనూ, మణినీ వెంటబెట్టుకుని ఇంటికి తిరిగి వచ్చాడు.

ఈలోపుగా శంభుడి తల్లి కొడుకుకోసం ఏడ్చిఏడ్చి కళ్ళు పోగొట్టుకుని గుడ్డిదై పోయింది. కొడుకు గొంతు విని ఆనందించిందే తప్ప ఆమె వాణ్ణి కళ్ళ చూడలేక పోయింది, తన కోడలినీ కళ్ళ చూడలేక పోయింది.

శంభుడు మణిని తీసి తల్లి కళ్ళకు దగ్గిరిగా పెట్టి, "ఇదైనా కనిపిస్తున్నదా, అమ్మా?" అని అడిగాడు.

తల్లి దాన్ని తీసుకుని తన కళ్ళకు ఎంతో దగ్గిరిగా పెట్టుకుని, "కనిపించటం లేదు, నాయనా!" అంటూండగానే ఆ మణి ఆమె గుడ్డికళ్ళకు తగిలింది. ఆ మరుక్షణమే ఆమె కళ్ళు యథాప్రకారం వచ్చేశాయి. ముని చేసిన తపస్సంతా దిగమింగిన ఆ మణి చాలా మహిమ గలదని శంభుడు తెలుసుకున్నాడు. దాని సహాయంతో తనకు ఏ కష్టాలూ రాకుండా చూసుకుంటూ, బంగారంతో తన కోరికలన్నీ తీర్చుకుంటూ అతను తన భార్యతో ఎంతోకాలం సుఖంగా కాపరం చేశాడు.






మాహిష్మతీనగర రాజైన యశోవర్ధనుడు అరవై ఏళ్ళు కాలం అవిచ్ఛిన్నంగా రాజ్య పాలన చేసి వృద్ధుడయాడు. ఇరవై ఏళ్ళ చిన్న వయసులో రాజ్యపాలనకు వచ్చిన అతడు, స్వయంగా అనేక యుద్ధాలు చేసి, రాజ్యపు ఎల్లలను ఎంతో విస్తరింపజేశాడు. అంత పెద్దరాజ్యానికి అధినేత అయినా, యశోవర్ధనుడికి వృద్ధాప్యంలో మనశ్శాంతి లేకుండా పోయింది. అందుకు కారణం అతడి కుమారులు.

యశోవర్ధనుడికి, తపోవర్ధనుడు, గుణ వర్ధనుడు అని యిరువురు పుత్రులు. పెద్ద వాడైన తపోవర్ధనుడు యిరవైఅయిదేళ్ల వయసువాడు. అతడికి లోకవ్యవహారాలమీద ఏమాత్రం ఆసక్తి లేదు. అతడెప్పుడూ తన కాలాన్ని ధర్మగ్రంథాలు పఠించటంలోనూ, వేదాంతులతో, పండితులతో ధర్మసూక్ష్మాల గురించి చర్చించటంలోనూ గడిపేవాడు.

చిన్నవాడైన గుణవర్ధనుడు ఇరవైఏళ్ల వయసువాడు. అతడిది యింకొక రకం తత్వం. అతడు కేవలం విలాసాల్లో కాలం గడుపుతూండేవాడు. అతడిలో ధర్మా ధర్మ విచక్షణ అన్నదే లేదు. అసత్య వాదులూ, దుండగులూ కపటులూ, అతడికి ఆప్తమిత్రులు.

యశోవర్ధనుడు తన శేషజీవితాన్ని ఏ ఆశ్రమంలోనో దైవధ్యానం చేసుకుంటూ గడపాలనుకున్నాడు. తను రాజ్యపరి త్యాగం చేసేముందు సమర్థుడైనవా డొకడు పరిపాలనా భారం వహించటం అవసరం,





లేకపోతే దేశం అరాజకం పాలవుతుంది. ఐహికవిషయాలమీద ఏమాత్రం అసక్తిలేని తన పెద్దకుమారుడు, తనతరవాత రాజు కావటం దేశానికి క్షేమం కాదు. ఇక పోతే చిన్నవాడు గుణవర్ధను డున్నాడు.

గుణవర్ధనుడి దుండగాలనుగురించి యశోవర్ధనుడు వినివున్నాడు. స్వయంగా అతణ్ణి చాలాసార్లు మందలించటంకూడా జరిగింది. ఇరవై ఏళ్ళ వయసులో ఎవరైనా అలాగే ప్రవర్తిస్తారనికూడా యశోవర్ధనుడు అనుకున్నాడు. రాజ్యభారం నెత్తిన పెడితే, అతడికి బాధ్యతలు తెలిసిరాగలవన్న నమ్మకం కలిగిందాయనకు.

అయితే, మంత్రి సామంతులలో కొందరితో యీ విషయమై మాట్లాడినప్పుడు, వారు గుణవర్ధనుడు రాజు కావటాన్ని వ్యతిరేకించారు. పెద్దవాడైన తపోవర్ధనుడుండగా, చిన్నవానికి రాజరికం కట్టబెట్టడం ప్రజలలో అశాంతిని రేకెత్తించగలదని వారు సంశయం వెలిబుచ్చారు.

ధర్మచింతా, గుణశీలాలూ వున్న తపోవర్ధనుడు రాజుకావటం అందరికీ క్షేమం కాగలదని వారు సలహా యిచ్చారు.

ఈ సలహా యశోవర్ధనుడికి మనస్కరించలేదు. క్షాత్రధర్మంలో ఏమాత్రం అసక్తినీ కనబరచని తన పెద్దకుమారుడు రాజు కావటమంటే, అతడు ఏ మంత్రిచేతి కీలుబొమ్మగానో వుండవలసి వస్తుందని ఆయన భావించాడు. తను నెత్తురోడ్చి సంపాయించిన రాజ్యం, తన వంశీకుల నుంచి పరాయివాళ్ళ హస్తగత మవుతుందని కూడా భయపడ్డాడు.

ఇలాటి భయ సందేహాలతో కొంతకాలం మథనపడి యశోవర్ధనుడు చివరకు ఒక నిర్ణయానికి వచ్చాడు. అది, తన రాజ్యంలోని సామంతులనూ, పెద్దలనూ ఒకచోట సమావేశపరచటం; వారికి తన అభిప్రాయం తెలియపరిచి, చిన్నవాడైన గుణవర్ధనుణ్ణి





తన తరవాత రాజుగా అంగీకరించవలసిం దని కోరటం.

ఇందుకుగాను కొన్నాళ్ళ తరవాత రాజ్యం లోని సామంతులూ, పెద్దలూ సభకు పిలవ బడ్డారు. అందరూ సమావేశం అయిన తర వాత, యశోవర్ధనుడు వారికి తన అభి ప్రాయం తెలిపరిచాడు. అంతేకాక, గుణ వర్ధనుడు తన తరవాత పట్టాభిషిక్తుడు కావ టానికి, తన పెద్దకుమారుడైన తపోవర్ధనుడు అభ్యంతరం చెప్పడనికూడా సామంతలకు హామీయిచ్చాడు.

అవగుణాల పుట్ట అయిన గుణవర్ధనుడు రాజు కావటం సభలో ఎవ్వరికీ యిష్టం లేదు. అయినా, ఆ మాట రాజుతో అనేం దుకు ప్రతివారూ జంకారు. అలాంటి సమ యంలో వీరపుర సామంతుడయిన సూర్య వర్మ ధైర్యంగా సభలో లేచి నిలబడి, గుణ వర్ధనుడి దుండగాలను గురించి చెప్పి, అతడు రాజు కావటానికి తగడని తన అభి ప్రాయం ప్రకటించాడు.

సభలో హర్షధ్వానాలు చెలరేగినై. సూర్య వర్మ చెప్పినదానిని బలపరుస్తూ చాలా మంది సామంతులు మాట్లాడారు. కొందరు యశోవర్ధనుణ్ణి మరి కొంతకాలం రాజ్య పాలనాభారం వహించవలసిందనీ, యీ



కాలంలో తపోవర్ధనుడికి రాజ్య వ్యవహా రాల్లో ఆసక్తి కలిగించేందుకు ప్రయత్నించ వలసిందనీ విన్నవించారు.

యశోవర్ధనుడికి ఏమి చేసేందుకూ పాలు పోలేదు. ఇందరు సామంతులనూ, పెద్ద లనూ వ్యతిరేకించి, తను చిన్న కొడు కును రాజుగా ప్రకటిస్తే, దేశంలో అంత ర్యుద్ధం తప్పదు. తన సామంతులందరిలో బలవంతుడూ, పలుకుబడికలవాడూ అయిన సూర్యవర్మ యిలాంటి తిరుగు బాటుకు తప్పక నాయకత్వం వహిస్తాడు. ప్రస్తుతానికి దేశంలో శాంతి కాపాడాలంటే, తను రాజ్యపరిత్యాగం చేసే ప్రయత్నం విర



మించుకున్నట్టు ప్రకటించటం ఒక్కటే మంచిమార్గంగా ఆయనకు తోచింది. ఆయన అలాగే చేశాడు. సభికుల్లో ఆనందోత్సాహాలు వెల్లివిరిసినై.

సభ చాలించిన తరవాత యశోవర్ధనుడు తన మంత్రిని వెంటబెట్టుకుని నేరుగా ఉద్యానవనానికి వెళ్ళాడు. అక్కడ మంత్రిని సంప్రతించగా, అతడు సూర్యవర్మతో ఏకాంతంగా మాట్లాడటం మంచిదని యశోవర్ధనుడికి సలహా యిచ్చాడు.

సామంతుల్లో బలవంతుడైన అతణ్ణి తమ పక్షం చేసుకుంటే, అంతా చక్క బడగలదని మంత్రి అభిప్రాయపడ్డాడు.

సూర్యవర్మ ఉద్యానానికి పిలిపించబడ్డాడు. యశోవర్ధనుడు సగౌరవంగా అతడికి తన పక్కన కూర్చునేందుకు చోటు చూపి, "వర్మా! నీవు యీనాటి సభలో నిర్భయంగా వెలువరించిన అభిప్రాయాలతో నేను ఏకీభవించలేకపోయినా, నీ ధైర్యాన్ని మెచ్చుకుంటున్నాను. వీరపుర సామంతులెప్పుడూ ప్రభుభక్తిపరాయణులని నాకు తెలుసు. గుణవర్ధనుడు యింకా చిన్నవాడు. నీబోటి అనుభవజ్ఞుల అండదండలూ, సహాయసహకారాలూ వుంటే, అతడు చక్కని పరిపాలకుడు కాగలడని నా అభిప్రాయం," అన్నాడు.





"మహారాజా! ధర్మాధర్మాలు తెలిసిన వాడూ, సాధుశీలుడూ అయిన యువరాజు తపోవర్ధనుడుండగా, మీరు రాజ్యాన్ని మరెవరికో కట్టబెట్టచూడటం, ప్రజల దృష్టిలో న్యాయం అనిపించుకోదు," అన్నాడు సూర్యవర్మ.

"తపోవర్ధనుడు లౌకిక వ్యవహారాల్లో ఆసక్తి వున్నవాడు కాదు. అలాంటివాడివల్ల రాజ్యం అరాజకం పాలవుతుంది," అన్నాడు యశోవర్ధనుడు.

"అతడికి లౌకిక విషయాల్లో ఆసక్తి కలిగించటం ఏమంత కష్టంకాదు. జ్యేష్ఠుడుగా అతడు నిర్వహించవలసిన బాధ్యతలను గుర్తుచేస్తే, అతడు తప్పక రాజ్యభారం వహించగలడు," అన్నాడు సూర్యవర్మ.

యశోవర్ధనుడు తన మంత్రికేసి సాభిప్రాయంగా చూశాడు. మంత్రి, సూర్యవర్మ చెప్పినదానికి అవునన్నట్టు తల వూపాడు.

"అలా అయితే, తపోవర్ధనుణ్ణి ఒక్క సంవత్సరంపాటు నీ సంరక్షణలో వుంచుతాను. ఈ కాలంలో అతడికి లౌకిక వ్యవహారాల్లో ఆసక్తి కలిగించి, రాజార్హమైన విద్యాబుద్ధులు నేర్పగలవా?" అని అడిగాడు యశోవర్ధనుడు.

సూర్యవర్మ అందుకు అంగీకరించాడు. ముందుగా తను వీరపురం వెళ్ళి, అక్కడి



పరిపాలనా వ్యవహారాలను తన కుమారుడు చంద్రవర్మకు ఒప్పచెప్పి, కొద్ది రోజులలోనే రాజధానికి తిరిగిరాగలనన్నాడు. ఇందుకు యశోవర్ధనుడు సరేనన్నాడు.

సూర్యవర్మ, యశోవర్ధనుడిదగ్గిర సెలవు తీసుకుని తన విడిదికి వెళ్ళాడు. ఆ రోజు సాయంత్రమే బయలుదేరి వీరపురం వెళ్ళేందుకు సన్నాహాలు ప్రారంభించాడు.

సూర్యవర్మ యీవిధంగా తిరుగుప్రయాణానికి సన్నాహాలు చేసుకుంటూ వుండగా, అతణ్ణి దారిలో పొంచివుండి హత్య చేసేందుకు మరొక ప్రదేశంలో ఏర్పాట్లు జరుగుతున్నవి. దీనికి నాయకుడు సర్పకేతుడనే



ఒక సామంతుడు. అతడి రాజ్యం వీరపురం ఎల్లలలోనే వుంది. ఎలా అయినా తను వీరపురాన్ని చేజిక్కించుకోవాలని అతడు ఎంతకాలంగానో వ్యూహాలు పన్నుతున్నాడు, కాని సాధ్యంకాలేదు. ఈనాడు, యశోవర్ధనుడి చిన్న కొడుకైన గుణవర్ధనుణ్ణి తన పక్షానికి తిప్పుకోవటంద్వారా తన పని సానుకూలం కాగలదని అతడు వూహించాడు.

తండ్రి తరవాత తను రాజు కావటానికి వ్యతిరేకించినవాడు వీరపుర సామంతుడైన సూర్యవర్మ అని తెలిసినప్పుడు గుణవర్ధనుడు నిలువెల్లా దహించుకుపోయాడు. అతడి అండ చూసుకునే తతిమ్మా సామంతులుకూడా తనకు వ్యతిరేకులయ్యారని అతడు భావించాడు. కాని, సూర్యవర్మను తను ఒంటరిగా ఎదిరించలేడు. తనవెంట తిరిగే మిత్రుల్లో ఎవరూకూడా అంత ధైర్యసాహసాలు కలవాళ్ళు కారు.

గుణవర్ధనుడు, సూర్యవర్మమీద పగ తీర్చుకోవటం ఎలానా అని ఆలోచిస్తున్న సమయంలో, సర్పకేతుడు అతణ్ణి చూడవచ్చాడు. ఇద్దరూ ఒకరి మనోభావాలను మరొకరు తెలుసుకున్నారు. కొద్దిమంది అంగరక్షకులతో వీరపురం పోతున్న సూర్యవర్మను, కొండలలో హఠాత్తుగా ఎదిరించి





చంపటం చాలా తేలిక అని సర్పకేతుడు చెప్పాడు. అందుకు అవసరం అయిన బలగం తనవెంట వున్నదన్నాడు.

"మీరు యీ పని విజయవంతంగా నెర వేర్చగలిగితే, ఏదో ఒకనాడు మీరు కోరిన సహాయం చేస్తాను. బలవంతుడైన సూర్య వర్మ ఆటంకం లేనినాడు నేను రాజు కావటం నిజం!" అన్నాడు గుణవర్ధనుడు.

"అందులో సందేహం లేదు. అలా జరుగుతుందని ముందుగా వూహించే, నేను సూర్యవర్మ సంస్థానాన్ని ఆక్రమించుకునేం దుకు అవసరమైన వ్యూహం ఆలోచించి వుంచాను. అతడి మరణవార్త తెలియ గానే, నా సైన్యం ఆ సంస్థానంమీద పడి ఆక్రమించుకుంటుంది. అందుకు సూర్య వర్మ కొడుకు చంద్రవర్మ పెద్ద ఆటంకం కాదు. నా సైన్యం అంతా మామూలు పౌరులు ధరించే ఉడుపులు ధరించి వీర పురం కోటను ఆక్రమించుకుంటారు. యశో వర్ధన మహారాజుకు, అది క్రూరుడైన సామం తుడిమీద సంస్థానప్రజలు చేసిన తిరుగు బాటుగా కనిపించేటట్టు చూడాలి," అన్నాడు సర్పకేతుడు.

"అందుకు అవసరం అయిన సహాయం నేను చేస్తాను. సూర్యవర్మ ప్రజాకంటకు




డని మా తండ్రిగారితో సమయం చూచు కుని చెపుతాను. అతడి హత్య వీరపుర సంస్థాన సరిహద్దుల్లోనే జరగటం దీన్ని బాగా బలపరుస్తుంది. తతిమ్మా ఏర్పాట్లు మీరు చేయండి," అన్నాడు గుణవర్ధనుడు.

గుణవర్ధనుడి మాటలు సర్పకేతుడికి చాలా ఉత్సాహాన్ని కలిగించినై. బలవంతు డైన సూర్యవర్మ ఆటంకం తొలగిననాడు, గుణవర్ధనుణ్ణి మాహిష్మతీ నగరరాజును చేయుటం ఏమంత కష్టంకాదని అతడికి తోచింది. సూర్యవర్మను హత్యచేసిన తరు వాత తను వీరపుర సంస్థానాన్ని తన సంస్థానంలో కలుపుకోవటమే గాక, మాహి





ష్మతీ రాజాస్థానంలోకూడా గొప్ప పలుకుబడిని సంపాయించవచ్చనుకున్నాడు.

ఈ విధంగా సూర్యవర్మను హత్య చేసేందుకు కుట్ర పన్నిన సర్పకేతుడు హడావిడిగా రాజధానీనగరం వదిలి, తన అనుచరులతో వీరపుర సంస్థాన సరిహద్దుల్లో పొంచివుండి సూర్యవర్మ రాకకోసం ఎదురు చూడసాగాడు.

సూర్యవర్మకు తనమీద జరుగుతున్న కుట్రవిషయం ఏమీ తెలియదు. అతడు కొద్దిమంది అనుచరులతో, సేవకులతో కలిసి ఆ సాయంకాలమే తన సంస్థానానికి బయలుదేరాడు. మధ్యదారిలో ఆ రాత్రికి ఒకచోట మజిలీచేసి, సూర్యోదయం కాగానే మళ్లీ ప్రయాణం సాగించాడు.

ఆనాటి సూర్యాస్తమయ సమయానికి సూర్యవర్మ తన సంస్థాన సరిహద్దులను చేరాడు. ఆ ప్రాంతమంతా కొండలా, చిట్టడవులామయం. ఏ ప్రమాదాన్నీ శంకించని సూర్యవర్మ తన గుర్రాన్ని ముందు నడుపుతూ, తను యువరాజు విషయంలో స్వీకరించ నున్న కొత్త బాధ్యతలను గురించి ఆలోచిస్తున్నాడు.

హఠాత్తుగా కొండగుట్టలలో చిన్న కలకలం బయలుదేరింది. సూర్యవర్మ ఆ ధ్వని వింటూనే గుర్రాన్ని ఆపి వెనుదిరిగి తన అనుచరులకేసి చూసేంతలో, రాళ్ళవెనక నుంచీ, చెట్లవెనకనుంచీ సామాన్య పౌర దుస్తులు ధరించివున్న అనేకమంది సాయుధులైన రౌతులు భీకరంగా అరుస్తూ వాళ్ళమీద పడ్డారు. సూర్యవర్మ రెప్పపాటు కాలంలో ఒరనుంచి కత్తిదూసి, శత్రువులను ఎదుర్కొన్నాడు. కాని, అసరికే అతడు తన అనుచరులనుంచి వేరు చేయబడ్డాడు. పదీ పన్నెండుమంది సాయుధులు భీకరంగా అరుస్తూ ఒక్కుమ్మడిగా అతడి మీద విరుచుకుపడ్డారు.

—(ఇంకా వుంది)



# ప్రేమోపాసకులు

విసుగుచెందని విక్రమార్కుడు మరొకసారి చెట్టువద్దకు వెళ్ళి, శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే శ్మశానంకేసి మౌనంగా నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఈ నిశిరాత్రివేళ హాయిగా హంసతూలికాతల్పంపై నిద్ర పోక ఇలా శ్రమపడుతున్న నిన్ను చూస్తే నా గుండె కరిగిపోతున్నది. సాధారణంగా ప్రేమించిన వారు మాత్రమే అత్యంత సాహసంతో అష్ట కష్టాలనూ బుద్ధిపూర్వకంగా ఎదుర్కొంటారు. ఇందుకు దృష్టాంతంగా నీకు నంద సునందుల కథ చెబుతాను విను," అంటూ ఈ కింది కథ చెప్పసాగాడు :

ఒకప్పుడు శరభదేశానికీ సాళ్వదేశానికీ మధ్య గొప్ప యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో సాళ్వదేశం పూర్తిగా ఓడిపోవటమే గాక సాళ్వరాజ వంశం యావత్తూ సర్వనాశనమయింది. శరభదేశపు రాజు

## బేతాళ కథలు



17



సునత్సేనుడు యుద్ధం పూర్తి కాగానే సాళ్వ రాజధానిని తన సైనికులచేత కొల్లగొట్టించాడు. కొందరు సైనికులు నగరాన్ని దోచుకున్నారు. పాతిపెట్టిన నిధులకోసం కొందరు ఇళ్ళు పడగొట్టి గోడలు తవ్వారు. మరి కొందరు యుద్ధరంగమంతటా తిరిగి చచ్చిపోయినవారిని దోచుకున్నారు. ఇలా శవాలను దోచుకునేవారికి ఇద్దరు యోధులు కొనప్రాణాలతో దొరికారు. సునత్సేనుడి భటులు వారిని తమ రాజుగారి గుడారానికి తీసుకుపోయారు.

ఇలా యుద్ధరంగంలో సునత్సేనుడికి దొరికినవారే నంద సునందులు. వారు సాళ్వ రాజ వంశానికి చెందినవారు. సయాన అన్నదమ్ములు కారు గాని, దగ్గిరదాయాదులు. కొద్దిపాటి చికిత్సతోనూ ఆహారంతోనూ వారు చావు తప్పి బయటపడ్డారు. కాని వారు తనకు పరమశత్రువులు గనక సునత్సేనుడు వారిని శరభనగరానికి తీసుకుపోయి వారికి యావజ్జీవ కారాగారం విధించాడు. యుద్ధరంగంలో ప్రాణాలు వదిలి వీరస్వర్గానికి పోవలిసిన నంద సునందులు కారాగార నరకంలో చిక్కుకుపోయారు. వారు ఆ ఖైదునుంచి ప్రాణాలతో బయటపడే అవకాశం లేదు.

సునత్సేనుడికి మనోరమ అని ఒక చెల్లెలున్నది. ఆమెకు యుక్తవయసు వచ్చింది గాని తగిన వరుడు కనబడనందున అన్నగారు ఆమెకింకా వివాహం చెయ్యలేదు. మనోరమ చక్కదనం అప్సరసలను మించినది. చక్కదనానికి తోడు మంచి వివేకం కూడా కలది. శరత్కాలం వెళ్ళి వసంతకాలం రాగానే ఆమె ప్రతిరోజూ ఉద్యానవనానికి వెళ్ళి తనకు నచ్చిన పూలుకోసి తెచ్చుకోవటం ఆమెకు అలవాటు. ఆవిధంగా ఆమె ఒకనాడు ఉద్యానవనానికి వచ్చింది.

ఈ ఉద్యానం ఖైదుకు ఒక పక్కగా ఉన్నది. నంద సునందు లున్న చోటినుంచి



ఈ ఉద్యానవనంలో ఒక భాగం కనిపిస్తుంది. గవాక్షంవద్ద నిలబడి ఉద్యానంలోకి పరధ్యానంగా చూస్తున్న నందుడికి మనోరమ అకస్మాత్తుగా కనిపించింది.

"తమ్ముడూ, ఆమె వనదేవతా? లేక మనిషా? ఇంత అందగత్తెను నేనెక్కడా చూడలేదు. ఈమెను తప్ప నేనింకెవరినీ ప్రేమించలేను!" అన్నాడు నందుడు.

సునందుడుకూడా గవాక్షందగ్గిరికి వచ్చి మనోరమను చూసి మరుక్షణమే ప్రేమాగ్నిలో పడిపోయాడు. వారు చూస్తూండగానే మనోరమ కనుచూపు దాటి పోయింది. నంద సునందులు ఒకరినొకరు చూసుకున్నారు.

"కీడులోకూడా మేలుంటుంది, అన్నా! మన ప్రారబ్ధం బాగుండక ఈ ఖైదులో చిక్కపోయామని అనుకున్నాను. కాని, ఖైదులో ఉండబట్టేకదా ఈ జగన్మోహినిని ప్రేమించే అవకాశం కలిగింది! రోజూ ఆమె కనబడే పక్షంలో నూరేళ్లయినా ఈ ఖైదు సంతోషంతో భరిస్తాను!" అన్నాడు సునందుడు.

ఈ మాటలు విని నందుడు తమ్ముడిపైన మండిపడ్డాడు.

"నేను ప్రేమించిన స్త్రీని నువ్వెలా ప్రేమిస్తావు? నీకు ధర్మం ఆపాటికూడా తెలియదా? నేను నీకన్న పెద్దవాణ్ణి, ఆమెను ముందు నేను చూశాను, చూస్తూనే ప్రేమించాను. నా ప్రేమ సఫలం కావటానికి నువు సహాయపడవలిసింది పోయి నాపై పోటీకి వచ్చి, నేను ప్రేమించిన మనిషినే నువూ ప్రేమిస్తావా?" అని నందుడు సునందుణ్ణి నిష్ఠురాలాడాడు.

"ఆత్మరక్షణలోనూ, ప్రేమలోనూ ఎవరికి వారే! నాయిష్టం, నేను ప్రేమిస్తాను. నాకు నీపెత్తన మేమిటి?" అని సునందుడన్నాడు.

ఇద్దరూ వాదించుకున్నారు, ఒకరినొకరు నిందించుకున్నారు. బద్ధవిరోధులయారు. ప్రేమ వారిమధ్యన చిచ్చుపెట్టింది. తాము

ప్రేమించిన స్త్రీ ఎవరోకూడా వారికి తెలియదు. ఆమెను పెళ్లాడే అవకాశం ఇద్దరిలో ఏ ఒకరికీ లేదు. కాని ఈ వివేచన వారికిద్దరికీ లేకుండాపోయింది.

మనోరమ ప్రతి సాయంకాలమూ ఉద్యానానికి వచ్చి వారికి కనిపించేది. ఆమెను చూస్తున్నంతసేపూ వారికి స్వర్గంలో ఉన్నట్టే ఉండేది. ఆమె కనపడకుండా పోగానే వారిద్దరిరూ గర్భశత్రువులలాగా పోట్లాడుకోవటం ప్రారంభించేవారు.

ఇలా కొన్ని మాసాలు గడిచాయి.

ఒకరోజు మగధదేశపు రాజు సునత్సేనుణ్ణి చూడవచ్చాడు. వారిద్దరూ తల్లుల వైపున దగ్గిర బంధువులు. తాను సాళ్వ దేశాన్ని జయించి, రాజధానిని నేలమట్టం చేసిన సంగతీ, తన శత్రురాజు పరివారానికి చెందిన నందసునందులను తెచ్చి యావజ్జీవ కారాగారశిక్ష విధించిన సంగతీ సునత్సేనుడు మగధరాజుతో చెప్పాడు.

మగధరాజు ఆశ్చర్యంతో, "సునందుణ్ణి ఖైదులో ఉంచావా? అతనూ నేనూ ఒక గురువుపద్ద చదువుకున్నాం సుమా! నేనివాళ చాలా చెడ్డవార్త విన్నాను," అన్నాడు.

సునత్సేనుడు కొంచెం ఆలోచించి, "సునందుడు ఖైదీగా ఉండటం నీకు బాధ కలిగించే పక్షంలో అతన్ని ఈ రోజే చెర



విడిపిస్తాను!" అంటూ సునందుణ్ణి విడిపించ టానికి ఉత్తరువిచ్చాడు. తరవాత ఆయన సునందుడితో, "నీ అదృష్టం బాగుంది. అందుచేత నీకు విమోచనం లభించింది. అయితే నువు నాకు గర్భశత్రువువే, అందు వల్ల నారాజ్యం విడిచిపోవటానికి ఒకరోజు గడువిచ్చాను, వెళ్లి పో. ఆ తరువాత నువు నా రాజ్యపు సరిహద్దులో కనిపించావంటే తక్షణం శిరచ్ఛేదం చేయిస్తాను," అన్నాడు.

సునందుడు ఆ రోజే బయలుదేరి తన దేశానికి వెళ్లిపోయాడు. కాని స్వేచ్ఛ లభించిందన్న ఆనందం అతనికి కొంచెం కూడా దక్కలేదు. సాళ్వదేశం కళా కాంతులు లేకుండా ఉంది. రాజధాని ఉండ వలసిన చోట శిథిలాలుమాత్రమే ఉన్నాయి. పూర్వం అతన్ని ఎరిగున్నవారు కొందరు అతన్ని చేరదీసి అతనికొక ఇల్లు ఇప్పించారు. కాని జీవితంలో అతనికి ఏమాత్రమూ ఆనందం లేదు.

"ఈ స్వేచ్ఛ దేనికి? ఆ చెరసాలలో ఉంటే నాప్రియురాలిని ఎప్పుడైనా చూసి ఆనందించేవాణ్ణిగద! ఇప్పుడిక ఆమెను కళ్ల చూసే అదృష్టంకూడా లేదు. ఆమె కోసం కుమిలి ఏడవటం తప్ప నాకింకేమీ మిగలలేదు. నాకన్న నందుడు ఎన్నోరెట్లు అదృష్టవంతుడు. వాడు రోజూ ఆమెను కళ్ల





చూసి అయినా సంతోషిస్తాడు," అనుకున్నాడు సునందుడు.

అక్కడ నందుడుకూడా ప్రతిరోజూ బాధపడుతూనే ఉన్నాడు.

"సునందుడు ఏదో మాయోపాయం చేసి ఖైదునుంచి బయటపడ్డాడు. ఇక వాడా స్త్రీని పెళ్లాడటానికి అడ్డేమీ లేదు. మరొకవిధంగా ఆమెను పెళ్లాడలేకపోతే దేశానికి తిరిగి వెళ్లి పెద్ద సేనను పోగుచేసుకుని సునత్సేనుడిపైకి దండెత్తి వచ్చి, యుద్ధంలో గెలిచిఅయినా ఆమెను పెళ్లాడగలడు. నేనే ఏమీ చేతగాని అసమర్థపు స్థితిలో యిక్కడ పడిఉన్నాను," అనుకున్నాడు నందుడు.

ఒక ఏడాది గడిచింది. సునందుడి మనసు ఆరోజుకారోజు బరువెక్కుతున్నదే గాని కొంచెంకూడా తేలికపడటంలేదు. అతను తన ప్రియురాలిని చూసి ఏడాది అయింది. ఈలోపల నందుడామెను ఎన్నిసార్లు చూసి ఆనందించాడో! ఇలా ఆలోచించటంవల్ల సునందుడికి నిద్రాహారాలు కూడా లేకుండా పోయాయి.

"ఇలా జీవించేకంటె ఆమెను చూస్తూ చచ్చిపోవటమే మేలు. నేను శరభదేశం పోతాను!" అని సునందుడు నిశ్చయించుకున్నాడు. అతను అద్దంలో చూసుకున్నాడు. గడిచిన ఏడాదిలోనూ అతని ముఖం ఎంతో మారిపోయింది, ఒకవేళ అతను శరభదేశం వెళ్ళినా అతనినెవరూ గుర్తించలేరు. అందుచేత సునందుడు తన పేరు మార్చుకుని, సోమపాలుడని పేరుపెట్టుకుని శరభదేశానికి బయలుదేరి వెళ్లాడు.

అతను అనుకున్నట్టే అతన్ని ఎవరూ గుర్తించలేదు. రాజభవనంలో అతనికి సులువుగా కొలువు కుదిరింది. అతను యువకుడూ, బలం గలవాడూ కావటంచేత మొదట్లో మోటపనులు సయితం ఉత్సాహంతో చేశాడు. అయితే అతను తెలివిగలవాడనీ, బాధ్యతలు నిర్వర్తించగలవాడనీ



దివాణం అధికారులు అతనికి కొంత పెత్తనం ఇచ్చి పెద్ద ఉద్యోగిని చేశారు. ఈ ఉద్యోగంలో అతనికి రాబడీ, పలుకుబడీ కూడా హెచ్చింది. ఇతర ఉద్యోగుల లాగా రాజుగారి సొమ్ము ఎలా తిందామా అన్న దుగ్ధ లేనివాడు గనక అతను అందరికీ మంచివాడయాడు. అతనికి కావలిసింది తన ప్రియురాలిని చూస్తూఉండటం. ఆమె సాక్షాత్తూ రాజుగారి చెల్లెలేనని అతనికి ఇప్పుడు తెలిసింది. రోజూ ఆమెను చూడటానికీ, ఆమెతో మాట్లాడటానికీకూడా అతనికి వీలుండేది. అతని కిప్పుడు అచ్చగా స్వర్గంలో ఉన్నట్టే ఉన్నది.

ఇలా ఉండగా అకస్మాత్తుగా ఒకరాత్రి నందుడు ఖైదునుంచి తప్పించుకున్నాడు. ఖైదుకాపలావా డొకడు అతనికి పారిపోవటానికి సహాయం చేశాడు. అయితే అతను నగరం దాటి ఆటే దూరం వెళ్ళకమునుపే తెల్లవారిపోయింది. పగలు జనసంచారం ఉంటుంది. తనను ఎవరో ఒకరు చూసి గుర్తించగలరు. తాను తిరిగి రాజుగారికి దొరికినట్టయితే తప్పక తన పీక తెగిపోతుంది. ఏదోవిధంగా శరభరాజ్యం నుంచి బయటపడి సాళ్వదేశం చేరుకుంటే, తాను పెద్దసేనను పోగుచేసి సునత్సేనుడిపై యుద్ధం చేయవచ్చు. యుద్ధంలో తాను గెలిచాడా తన ప్రియురాలు తనకు దక్కుతుంది; చచ్చిపోవటమే జరిగితే తన కష్టాలన్నీ ఈడేరుతాయి. తనకన్న ముందే విడుదల పొందిన సునందుడు ఈ పని చేసి ఉండవలసింది. ఆ పని ఇప్పుడు తాను చేస్తాడు.

ఈ విధంగా ఆలోచించినవాడై నందుడు పగలల్లా ఏ పొదలోనో దాక్కుని చీకటి పడగానే తిరిగి ప్రయాణం సాగించ నిశ్చయించి శరభనగరం వెలపల గల అడవిలో ఒక పొదలో దూరి దాక్కున్నాడు.

ఒక జాము పొద్దెక్కేసరికి విధివశాన సునందుడు షికారుగా ఆ అడవిలోకి



వచ్చాడు. మనిషి అలికిడి వినిన నందుడు పొదలోనుంచి చూసి సునందుణ్ణి గుర్తించి, బయటికి వచ్చి, "నువు ఇక్కడ ఎలా ఉన్నావు?" అని అడిగాడు.

సునందుడు నందుడితో తాను మారు పేరు పెట్టుకుని రాజభవనంలోనే ఉద్యోగం చేస్తున్న కథ యావత్తూ చెప్పాడు. నందుడు తాను ఖైదునుంచి తప్పించుకున్న సంగతీ, మనోరమను పెళ్ళాడటానికి తాను యుద్ధం తలపెట్టిన సంగతీ సునందుడితో చెప్పి, "నాకిప్పుడు నువు నిజంగా గర్భశత్రువువు! ఎందుచేతనంటే నేను తలపెట్టిన పనికి నువు ఒకడవే పానకంలో పుడకలాగా అడ్డు న్నావు. అందుచేత మన ఇద్దరమూ జీవించి ఉండటం పొసగదు. మనలో ఎవరుండాలో తేల్చుకుందాం!" అన్నాడు.

"నీ దగ్గిరా ఆయుధాలు లేవు, నా దగ్గిరా ఆయుధాలు లేవు. మనం ఎలా యుద్ధం చేస్తాం? రేపు ఈవేళవరకూ నువ్విక్కడే ఉన్నట్టయితే నేను రెండు కత్తులు తెస్తాను," అన్నాడు సునందుడు.

నందుడు సరేనన్నాడు. ఆ రాత్రి అతను ప్రయాణం మానుకుని ఆ పొదలలోనే గడిపాడు. మర్నాడు తెల్లవారుతూనే సునందుడు రెండు కత్తులు తీసుకుని అక్కడికి వచ్చాడు. వాటితో ఆ ఇద్దరూ భీకరమైన ద్వంద్వయుద్ధం ప్రారంభించారు.

ఆ రోజే సునత్సేనుడు తన భార్యనూ, చెల్లెలినీ వెంటబెట్టుకుని రథంపై లేళ్లను వేటాడటానికి బయలుదేరాడు. రథం అరణ్యం ప్రవేశించిన కొద్దిసేపటికే, కత్తులు ఒకదానికొకటి తగిలే చప్పుడు వినిపించింది. రాజు వెళ్లి చూసేసరికి రక్తప్రవాహాలతో తడిసి పోరాడుతున్న నంద సునందులు కనిపించారు.

"ఆపండి! ఎవరు కత్తి ఎత్తితే వారిని చంపేస్తాను!" అంటూ సునత్సేనుడు వారిని సమీపించి, "మీరెవరు?" అన్నాడు.

నందుడు రాజుకు తన కథా, సునందుడి కథా చెప్పేశాడు. అతను ఏమీ దాచలేదు. అంతా విని రాజు ఆశ్చర్యచకితుడయాడు. తన చెల్లెలిపైన గల ప్రేమకొద్దీ నంద సునందులు తమ ప్రాణాలు ఒడ్డిన పద్ధతి చూసి ఆయన ముచ్చటపడ్డాడు. సునందుడు ఖైదునుంచి బయటపడికూడా శరభరాజ్యానికి తిరిగివచ్చి, మనోరమను చూస్తూ ఉండగలందులకై తన ప్రాణానికి అపాయం కలిగే పని చేశాడు. నందుడు తన ప్రేమను సునందుడితో పంచుకోలేక అతన్ని చంపడమో తాను చావటమో జరగాలని తీర్మానించాడు. ఇద్దరి ప్రేమా అత్యాశ్చర్యకరమైనదే.

సునత్సేనుడు ఇద్దరినీ క్షమించాడు. ఇద్దరి ప్రేమకూ తగిన ప్రతిఫలం లభించాలనే అతని ఉద్దేశం. అయితే మనోరమ ఇద్దరిలో ఒకరినే పెళ్లాడగలదు. అందుచేత వారిద్దరి ప్రేమలలో ఏది గొప్పదో తేల్చే భారం మనోరమపైనే పెట్టదలిచాడు రాజు. ఆయన మనోరమతో, "అమ్మా, వీరిద్దరిలో ఎవరినో ఒకరిని పెళ్లాడే అవకాశం నీకిస్తే నువ్వెవరిని పెళ్లాడతావు?" అని అడిగాడు.

మనోరమ తడువుకోకుండా నందుణ్ణి వీరుకున్నది. సునత్సేనుడు వారిద్దరికీ వైభవంగా



పెళ్లిచేసి సాళ్వరాజ్యాన్ని నందుడికి తిరిగి ఇచ్చేశాడు.

సునందుడు మటుకు హతాశుడై చేయగలిగిందేమీ లేక దేశాలు పట్టి పోయాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, మనోరమ నంద సునందులలో నందుడి ప్రేమ ఎక్కువని ఎలా నిర్ణయించింది? తనకింద సేవకుడుగా అణిగిమణిగి ఉంటున్న సునందుణ్ణి వదిలేసి, తనపై యుద్ధం తలపెట్టిన నందుణ్ణి తన చెల్లెలు వరిస్తే సునత్సేనుడు ఎందుకు అభ్యంతరం చెప్పలేదు? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది" అన్నాడు.

"నందుడి ప్రేమ సునందుడి ప్రేమ కన్న ఎక్కువైన దనటానికి ఎలాటి సందేహమూ లేదు. సునందుడుకూడా మనోరమను ప్రేమించినప్పటికీ, ఆ ప్రేమకోసం అతను అపాయకరమైన పనులకు పూనుకోలేదు. ఆమెను తన భార్యగా చేసుకునేటందుకు అతను ఎలాటి ప్రయత్నమూ చేయలేదు. అతను శరభదేశానికి తిరిగి రావటం సాహసమైన పనే, కాని తనను ఎవరూ గుర్తించరని రూఢి చేసుకున్న మీదటనే అతను ఆ సాహసానికి ఒడిగట్టాడు. నందుడు అలాకాదు. అతని లక్ష్యం మనోరమను పెళ్ళాడటం. అందుచేతనే అతను సునందుడి పోటీ ఏమాత్రమూ సహించలేకపోయాడు. అతను ఖైదునుంచి తప్పించుకోవటమూ, సునందుడి సంగతి తేల్చుకునేటందుకు ఒక రోజల్లా శరభదేశంలో ఉండిపోవటమూ, సేనను పోగుచేసుకుని వచ్చి శరభదేశపురాజును ఓడించాలని నిశ్చయించటమూ మొదలైన పనులు అతను చేశాడు. అవి అత్యంత ప్రమాదకరమైన పనులు. అందుకే మనోరమ అతని ప్రేమను స్వీకరించింది. ఇక సునత్సేనుడు అభ్యంతరం చెప్పకపోవటానికి ప్రబలమైన కారణం ఒకటి ఉంది. మనోరమకోసం నందుడు సునత్సేనుడిపై యుద్ధం తలపెట్టాడే గాని, అతను గెలిచే అవకాశం ఏమీ లేదు. సాళ్వదేశం ఏనాడో చితికిపోయింది. అది బాగా ఉన్నప్పుడే సాళ్వరాజు తనతో పోరి ఓడిపోయాడు. అలాటి పరిస్థితిలో నందుడు తనకు ప్రమాదకరమైన శత్రువు అయే అవకాశం ఏమీ లేదు. ప్రేమయొక్క ప్రేరణ చేతనే నందుడు అలాటి ఆలోచన చేశాడని గ్రహించి సునత్సేనుడు వివాహానికి అంగీకరించాడు," అని విక్రమార్కుడు చెప్పాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కాగానే బేతాళుడు శవంతోసహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. —( కల్పితం )





# నేర్పరులైన దొంగలు

పూర్వం అరేబియాలోని ఒక దేశంలో ఇద్దరు దొంగలుండేవారు. వారిలో ఒకడు పగటి దొంగ; వాడు జేబులు దోచి డబ్బు గడించేవాడు. రెండవవాడు రాత్రిదొంగ; కన్నాలు వేసి దొంగతనాలు చేయటం ద్వారా ధనం సంపాయించేవాడు.

ఈ దొంగలిద్దరూ తమకు తగిన అందగత్తె నొకతెను చూసి పెళ్ళాడగోరారు. ఇద్దరూ ఒకతెనే ప్రేమించటంచేత ఆ పిల్ల వారిలో ఎవణ్ణి చేసుకోవాలో తేల్చుకోలేక పోయింది. నన్ను చేసుకోమంటే నన్ను చేసుకోమని వారు పీడించటంచేత ఆమె వారిద్దరితోనూ ఈ విధంగా చెప్పింది: "మీరిద్దరూ దొంగతనాలు చేసి బతికేవాళ్ళే, ఇద్దరూ నన్ను పోషించగలవాళ్ళే. కాని మీ ఇద్దరిలో ఎవరు ఎక్కువ నేర్పరి అయితే వాణ్ణి చేసుకోవాలని నాకున్నది. అందుచేత మీ ఇద్దరూ కూడబలుక్కుని ఒక నిర్ణయానికి వచ్చినట్టయితే నేను మీలో నేర్పరిని పెళ్ళాడగలను," అన్నదామె.

దొంగలిద్దరూ ఆమె చెప్పినదానికి సరేనని ఒకరి నేర్పరితనం ఒకరికి చూపించటానికి నిశ్చయించుకున్నారు.

"ముందు నా నేర్పరితనం నీకు చూపుతాను. తరవాత నీ నేర్పరితనం నాకు చూపుదువు గాని. ఆ తరవాత మన ఇద్దరిలో ఎవరు గొప్ప అయినదీ తేల్చుకుందాం!" అన్నాడు పగటి దొంగ, కన్నపు దొంగతో.

కన్నపు దొంగ ఇందుకు ఒప్పుకున్నాడు, ఇద్దరూ కలిసి షరాబువీధికి వెళ్ళారు. అక్కడ ఒక వడ్డీవ్యాపారస్తుడు ప్రతి దుకాణానికీ వెళ్ళి, ఆ దుకాణదారులు తన కివ్వవలసిన బాకీలూ, వడ్డీలూ వసూలుచేస్తూ వీధివెంట వెళ్ళటం వారికంట పడింది.

"ఆ వడ్డీవ్యాపారిని చూడు. వాడి జేబులో ఉండే సంచీలో చాలా సొమ్ముంటుంది.

టి. వెంకటరావు



దాన్ని కాజేసుకు వస్తాను చూసుకో!" అన్నాడు పగటి దొంగ.

ఈ మాటలు విని కన్నపు దొంగ ఆశ్చర్య పడ్డాడు. వాడికి చీకటిమాటున దొంగతనాలు చెయ్యటం చేతనవును గాని, పట్టపగలు పదిమంది తిరిగే వీధిలో జేబు కొట్టటం ఎంతమాత్రమూ చేతగాదు. కాని ఆ విద్య తెలిసిన పగటిదొంగ వడ్డీవ్యాపారి వెనకే నాలుగడుగులు నడిచి సునాయాసంగా ఆయన జేబులో ఉండే మొహరీల సంచీ లాగేసి తన స్నేహితుడివద్దకు తిరిగి వచ్చాడు.

"నువు నిజంగా అరితేరినవాడివే సుమా!" అన్నాడు కన్నపు దొంగ.

"నా తెలివి ఈ సంచీని కాజెయ్యటంలో లేదు. ఇది నాదేనని న్యాయాధికారిచేతనే అనిపిస్తాను చూస్తూ ఉండు. అలా చేయని పక్షంలో రక్షభటులు నాదగ్గిర ఈ సొమ్ము పట్టుకుని దొంగసొమ్మని సులువుగా రుజువు చేస్తారు. అందుచేత, ఈ సొమ్ము నాదేనని ముందే రుజువుచేసేస్తాను!" అన్నాడు పగటిదొంగ.

"అది సాధ్యమేనా?" అన్నాడు కన్నపు దొంగ.

"నువే చూస్తావుగా!" అంటూ జేబు దొంగ తన స్నేహితుణ్ణి ఒక సందులోకి తీసుకుపోయి, అక్కడ సంచీ విప్పి అందులో ఉన్న మొహరీలు లెక్కించాడు. సరిగా అయిదువందల మొహరీలు ఉన్నాయి. వాటిలోనుంచి పది తీసి తన జేబులో వేసుకుని, తనవద్ద ఉన్న రాగిముద్రిక ఒకటి సంచీలో వేసి, జేబుదొంగ సంచీని యథా ప్రకారం కట్టేశాడు.

తరవాత అతను మళ్ళీ షరాబు వీధిలోకి వచ్చి, వడ్డీవ్యాపారి వెనకగా కొంతదూరం వెళ్ళి ఆ సంచీని తిరిగి ఉపాయంగా ఆయన జేబులో వేసేశాడు.

ఈ పాటికి వడ్డీవ్యాపారి తన దుకాణం దగ్గిరికి వచ్చి లోపలికి పోబోతున్నాడు.

ఇంతలో జేబుదొంగ గట్టిగా గొంతెత్తి, "దొంగ! దొంగ! పట్టుకోండి!" అని అరుస్తూ వడ్డీవ్యాపారిపై బడి అతణ్ణి నాలుగు గుద్దులు గుద్దాడు.

అందరూ పోగయారు. జేబుదొంగ వారితో, "వీడు దొంగముండాకొడుకు! చూడండి, పైకి ఎలాటి పెద్దమనిషిలాగా ఉన్నాడో. నా మొహరీల సంచీ కాజేసి ఏమీ తెలియనట్టు పోతున్నాడు!" అన్నాడు.

వడ్డీవ్యాపారిని చూస్తే అందరికీ మంటే. "న్యాయస్థానానికి ఈడ్చుకుపొండి!" అని అందరూ సలహా ఇచ్చారు. జేబుదొంగ వడ్డీ వ్యాపారిని రెక్కపట్టుకుని న్యాయస్థానానికి లాక్కుపోయి న్యాయాధికారితో, "అయ్యా, ఈ ముసలివాడు నా మొహరీల సంచీ కాజేశాడు. తమరు నాకు న్యాయం చేయించాలి!" అని విన్నవించుకున్నాడు.

"దొంగిలించిన సంచీ ఏదీ?" అని అడిగాడు న్యాయాధికారి.

"జేబులో వేసుకున్నాడు. నేను కళ్ళారా చూశాను!" అన్నాడు జేబుదొంగ.

వడ్డీవ్యాపారి జేబులు పరీక్షిస్తే సంచీ ఉన్నది. వడ్డీవ్యాపారి కంగారుతో, "అయ్యా, ఇది నా సంచీయే. నేను బాకీలు వసూలు చేసుకుంటుండగా ఈ మనిషి నాకు దొంగ



తనం అంటగట్టాడు. కాని నేనీ మనిషిని ఎన్నడూ చూసికూడా ఎరగను," అన్నాడు.

"అది నీ సంచీయే అయితే అందులో ఏమేమి ఉన్నదీ చెప్పు," అన్నాడు న్యాయాధికారి.

"అందులో అయిదువందల మొహరీలున్నాయి, అంతే!" అన్నాడు వడ్డీ వ్యాపారి నిబ్బరంగా.

"అది అబద్ధం! అందులో నాలుగు వందల తొంభై బంగారు మొహరీలూ, నా రాగి ముద్రికా ఉన్నాయి. ఈ దొంగవాడు తమముందు అబద్ధమాడుతున్నాడు!" అన్నాడు జేబుదొంగ.

సంచీ విప్పి చూస్తే అందులో నాలుగు వందల తొంభై మొహరీలూ, ముద్రికా ఉన్నాయి. న్యాయాధికారి ఆ సంచీని జేబుదొంగ కిప్పించి, వడ్డీవ్యాపారికి నూరు కొరడా దెబ్బలు శిక్ష విధించాడు.

సంచీ తీసుకుని కన్నపుదొంగ వెంట తిరిగి వచ్చేస్తూ జేబుదొంగ, "ఎలా ఉంది నా నేర్పు?" అన్నాడు.

"జేబుదొంగతనాలలో నీ నేర్పరితనం అసాధారణమైనదే. కాని చీకటిదొంగ తనాలలో నా నేర్పరితనంకూడా ఈ రాత్రికి చూపిస్తాను. అప్పుడు మనలో ఎవరు గొప్పో తేల్చుకుందాం!" అన్నాడు కన్నపుదొంగ.

ఆ రాత్రి జాము పొద్దు పోగానే కన్నపు దొంగ ఒక తాటినిచ్చెన తీసుకుని జేబు దొంగను వెంటబెట్టుకుని రాజభవనం దగ్గిరికి వచ్చాడు.

"ఏమిటిది? రాజభవనంలోనే జొర బడతావా ఏం?" అన్నాడు జేబుదొంగ ఎంతో భయంతో.

"అవును. మామూలు ఇళ్లలో జొర బడటంలో నేర్పరితనం ఏముందీ?" అంటూ కన్నపుదొంగ తాటినిచ్చెనను గోడమీదికి విసిరివేశాడు.

దానికి పట్టు చిక్కగానే కన్నపుదొంగ పైకి ఎక్కుతూ, జేబుదొంగను తన నిచ్చెన



ఎక్కి వెనకే రమ్మన్నాడు. జేబుదొంగకు ప్రాణాలు ప్రాణాలలో లేవు.

ఇద్దరూ రాజుగారి అవరణలో ప్రవేశించారు. కన్నపుదొంగ రాజుగారి భవనం తలుపు ఒకటి ఉతకఎత్తి లోపల జొరబడి రాజుగారి శయ్యాగారానికి దారితీశాడు. కాళ్లు వణుకుతూ జేబుదొంగకూడా వాడి వెనకే వెళ్లాడు.

పడకగదిలో రాజుగారు నిద్రపోతున్నాడు. బానిస ఒకడు రాజుగారికి కాళ్లు పట్టుతూ కునికిపాట్లు పడుతున్నాడు. జేబుదొంగను అవతల గదిలో ఉండమని సైగచేసి, కన్నపుదొంగ మునివేళ్లమీద నడుస్తూ వెళ్లి బానిసను వెనకనుంచి పట్టుకుని, ఒక చేత్తో నోరునొక్కి రెండో చేత్తో వాణ్ణి తాడుతో కట్టేసి, నోట్లో గుడ్డలు కుక్కి, గదిలో ఒకమూల పారేసి, వాడి స్థానంలో తాను కూచుని రాజుగారికి కాళ్లు పట్టసాగాడు.

వాడు కావాలని రాజుగారి కాళ్లు గట్టిగా పట్టటంతో రాజుగారికి నిద్రాభంగమయింది. కన్నపుదొంగ చిన్నగొంతుతో, "ఏలినవారికి మెలుకువ వచ్చినట్టుంది. ఒక చిన్నకథ చెబుతాను, ఆలకించండి: అనగనగా ఒక నగరం. దాన్ని ఒక రాజుగారు పాలిస్తున్నారు. ఆ నగరంలో ఒక జేబుదొంగా, ఒక కన్నపుదొంగా ఉన్నారు. వారిద్దరిలో



ఎవరు ఎక్కువ నేర్పరి అని సమస్య వచ్చింది. ముందుగా జేబుదొంగ తన నేర్పరితనాన్ని ప్రదర్శించటానికి తన స్నేహితుణ్ణి షరాబుబజారుకు తీసుకుపోయాడు," అంటూ జరిగిన కథ యావత్తూ చెప్పాడు. ఆఖరుకు తాను రాజుగారి శయ్యామందిరంలో ప్రవేశించి బానిసను కట్టి అవతల పెట్టి, వాడి స్థానం ఆక్రమించుకోవటందాకా చెప్పి, "మహారాజా, తమరే చెప్పండి! ఈ యిద్దరిలో ఎవరు ఎక్కువ నేర్పరి? జేబుదొంగా, కన్నపుదొంగా?" అని అడిగాడు.

ఇదంతా కథే కాబోలు ననుకుని రాజుగారు, "నిశ్చయంగా కన్నపుదొంగే నేర్పరి!" అన్నాడు. ఈ మాటలు అవతల ఉండే జేబుదొంగకుకూడా వినిపించాయి. తిరిగి రాజుగారికి నిద్ర పట్టినదాకా కాళ్ళు పిసికి, కన్నపుదొంగ తన స్నేహితుడితోసహా రాజభవనంనుంచి తిరిగి వచ్చేశాడు.

మర్నాడు ఉదయమే రాజుగారు నిద్రలేచి, తన బానిస కట్టిపడేసి ఉండటం చూసి, తాను రాత్రి విన్నది కథ గాదనీ, తనకు ఆ కథ చెప్పినవాడు కన్నపుదొంగేననీ గ్రహించి, వాడి తెలివితేటలకు ముచ్చటపడ్డాడు. తరవాత ఆయన ఒక చాటింపు వేయించి, కిందటి రాత్రి తన పడకగదిలో జొరబడిన దొంగ బయటపడినట్టయితే వాడికి కొలువిస్తానన్నాడు.

ఆ చాటింపు విని కన్నపుదొంగ రాజుగారి దర్శనం చేసుకున్నాడు. అన్నప్రకారం రాజుగారు వాడికి తన కొలువులో మంచి ఉద్యోగం ఇచ్చాడు.

కన్నపుదొంగ నేర్పరితనం గొప్పదని రాజుగారే స్వయంగా తీర్పు చెప్పటం తన చెవులతో విన్నాడు గనక జేబుదొంగ కాదనలేదు. అందుచేత వారు ప్రేమించిన పిల్ల కన్నపుదొంగనే పెళ్ళాడి, గొప్ప ఉద్యోగి భార్య అయింది.





# కీలుగుర్రం

## 2

[పర్షియాచక్రవర్తి చేసే వసంతోత్సవానికి ముగ్గురు సిద్ధులు వచ్చి మూడు అపూర్వమైన వస్తువులిచ్చారు. వాటిలో ఒకటి కీలుగుర్రం. ఈ బహుమానాలకు ప్రతిఫలంగా చక్రవర్తి తన ముగ్గురు కుమార్తెలనూ ఇచ్చి ముగ్గురు సిద్ధులకూ పెళ్లిచేయ నిశ్చయించాడు. కీలుగుర్రాన్ని ఇచ్చిన సిద్ధుడు శతవృద్ధు. చక్రవర్తి ఆఖరు కుమార్తె అతి సౌందర్యవతి. ఆమె ఆ వృద్ధును పెళ్ళాడటం ఇష్టం లేక ఏడవటం చూసి చక్రవర్తి కొడుకు కమరల్ అక్మార్ పెళ్ళికి వ్యతిరేకించాడు. తరవాత అతను కీలుగుర్రాన్ని పరీక్షించేటందుకు ప్రయత్నించగా ముసలి సిద్ధుడు అతనికి గుర్రాన్ని ఆకాశంలోకి ఎగిరించే కిటుకు చెప్పి, దించే కిటుకు చెప్పలేదు. అందుచేత అక్మార్ ఆకాశంలోకి ఎగిరిపోయి మరి తిరిగి రాలేదు. చక్రవర్తి సిద్ధుణ్ణి కొట్టి ఖైదులో పెట్టించి, తాను దుఃఖసముద్రంలో మునిగిపోయాడు.]

ఈలోపుగా కీలుగుర్రం సూటిగా ఆకాశంలోకి వెళ్లిపోతూ త్వరలోనే సూర్యమండలాన్ని చేరుకుంటుందా అనిపించసాగింది. రాజకుమారుడు అక్మార్ కంగారుపడసాగాడు.

"ఆ ముసలి సిద్ధుడు నన్ను నాశనం చెయ్యటానికే ఇలా చేశాడు. నా చిన్న చెల్లెలు తనని పెళ్ళాడకుండా అడ్డుపడ్డానని వాడికి నామీద ఆగ్రహం వచ్చివుంటుంది. ఇప్పుడు నేనేం చెయ్యాలి? ఈ ఆపద తప్పే మార్గమేమిటి? ఈ గుర్రం ఎగరటానికి మీట ఉన్నప్పుడు నేలమీద దిగటానికిమాత్రం మీట ఉండదా?" అనుకుంటూ అతను

ఆర్. దయానందరావు



గుర్రాన్ని అంతటా అతిజాగ్రత్తగా పరిశీలించాడు. అప్పుడు గుర్రం జీనులో ఎడమ పక్క అతి చిన్న మేకులాటిది ఒకటి అతనికి కనబడింది.

"గుర్రం మొత్తంమీద ఇది తప్ప మరే మీటా ఉన్నట్టు కనబడదు," అనుకుని అతను దాన్ని నొక్కాడు. వాయువేగంతో పైకి దూసుకుపోతున్న గుర్రం క్రమంగా తగ్గసాగింది. కొద్దిసేపట్లో అది ఆకాశంలో ఆగిపోయి మళ్ళీ దిగనారంభించింది. దిగేటప్పుడు కూడా దానివేగం అంతకంతకూ విపరీతంగా హెచ్చసాగింది. తాను భూమి మీద అంత వేగంతోనూ పడిపోయి గుర్రంతో సహా రూపుమాసిపోతానని అతను భయపడ్డాడు. కాని అలా జరగలేదు. భూమి దగ్గిరికి వచ్చినకొద్దీ గుర్రం వేగం తగ్గసాగింది. చిట్టచివర కది అతి సుతారంగా ఈక వాలినట్టుగా, నేలమీద వాలింది.

రాజకుమారుడు కమరల్ అక్మార్ తిరిగి ధైర్యంతో ఊపిరి తీసుకున్నాడు. తనకు గుర్రం కిటుకు తెలిసినందుకూ, చావుతప్పి బతికి బయటపడినందుకూ అతను అల్లాకు ప్రణామాలు అర్పించాడు.

తరవాత అతను ఆ గుర్రాన్ని నడిపే యుక్తులన్నీ సాధించాడు. ఎందుచేతనంటే ఆ కీలుగుర్రం ఎగరటమూ, దిగటమూ మాత్రమే గాక, వెనక్కూ, ముందుకూ ఎగురుతుంది; వేగంగానూ, మెల్లిగానూ కదులుతుంది; కళ్ళెం లాగితే కుడికీ, ఎడమకూ కూడా తిరుగుతుంది. ఈ ఉపాయాలన్నిటినీ రాజకుమారుడు అభ్యసించాడు. తెలియవలసిన కిటుకులన్నీ తెలిశాయని తోచినమీదట అతను ఆ గుర్రాన్ని గాలిలో కొద్ది ఎత్తుకు తీసుకుపోయి, సుమారైన వేగంతో పోనిస్తూ అనేక నదులూ, కొండలూ, నగరాలూ, దేశాలూ, సముద్రాలూ దాటి ప్రయాణమై వెళ్ళాడు. ఈ ప్రయాణంలో అతనికి పూర్వం తెలియని వింతలు ఎన్నో

కనిపించాయి; ఎన్నో కొత్త నగరాలూ, దేశాలూ చూసి ఆనందించాడు.

అలా అతను ఆకాశాన వెళుతూండగా, కింద నేలపైన అతని కొక సుందరమైన నగరం కనిపించింది. ఆ నగరంలోని భవనాలు బొమ్మల్లోలాగా చాలా అందంగా అమర్చి ఉన్నాయి. నగరంలో పచ్చిక బయళ్ళు తివాసీలు పరిచినట్టుగా ఉన్నాయి. వాటిమీద లేళ్ళూ జింకలూ పరిగెత్తుతున్నాయి. ఆ దేశంలో ఎక్కడ చూసినా జలప్రవాహాలే!

రాజకుమారుడు అక్మార్ తన గుర్రాన్ని ఆ నగరంమీదుగా గుండ్రగా తిప్పి అక్కడి ప్రకృతిసౌందర్యాన్ని తనివి దీర చూసి ఆనందించి, "ఈ నగరం ఏమిటో, ఇది ఏ దేశంలో వున్నదో, దీనికి రాజెవరో తెలుసుకోవాలి!" అనుకున్నాడు. సరిగా ఈసమయానికే సూర్యుడు అస్తమించి క్రమంగా చీకటి కమ్ముకురాసాగింది.

"ఈ రాత్రి ఈ నగరంలోనే గడుపుతాను. రేపు ఉదయం యిక్కడినుండి బయలుదేరి మా దేశం వెళ్లి, మా నాన్నగార్కితోనూ నా మిత్రులతోనూ నేను చూసిన వింతలూ, నాకు కలిగిన వింత అనుభవాలూ చెబుతాను," అనుకున్నాడతను.



తన గుర్రాన్ని ఎక్కడ దించాలా అని అతను ఆలోచిస్తూండగా అతనికి కింద ఒక రాజసౌధంలాటిది కనబడింది. అది సరిగా నగరం నడిమయాన వున్నది. దాని చుట్టూ బురుజులున్నాయి. కవచాలు ధరించిన నలభైమంది భటులు ఈటెలూ, విల్లులూ చేతబట్టి ఈ రాజసౌధానికి పహరా యిస్తున్నారు.

రాజకుమారుడు మీటనొక్కి కీలుగుర్రాన్ని రాజసౌధం పైభాగాన గల మిద్దెమీద దించాడు. తరవాత అతను గుర్రంమీదినుంచి దిగి ఆ గుర్రాన్ని చూసుకుని చాలా ముచ్చటపడి, "దీన్ని తయారుచేసినవాడు



నిజంగా సామాన్యుడుకాడు. అల్లా కటా క్షించి నేను ఇల్లు చేరుకుంటే ఆ ముసలి వాడికి ఎన్ని బహుమానాలైనా ఇస్తాను," అనుకున్నాడు.

బాగా చీకటిపడింది. అయితే రాజ భవనంలో జనసంచారం మాటుమణిగేదాకా రాజకుమారుడు ఆ మిద్దెమీదినుంచి ఇవతలికి రాలేదు. బాగా పొద్దుపోయింది. అతనికి ఆకలి దహించుకుపోతున్నది. చివర కతను తిండికోసం వెతుక్కుంటూ మిద్దె మీది నుంచి మెట్లు దిగివచ్చాడు. ఆ మెట్లు అతన్ని నేరుగా కిందికి తెచ్చాయి. అక్కడ ఒక చావడి కనిపించింది. దానిపై అందమైన చలవరాళ్ళు పరిచారు. వాటిపైన తెల్లని వెన్నెల పడుతున్నది. ఎక్కడా జన సంచారం గాని, మనుషుల అలికిడి గాని ఉన్నట్టు లేదు.

అతను నిశ్చేష్టుడై అటూ ఇటూ చూస్తూ, "ఎందుకు వచ్చిన పీడ. ఈ రాత్రికి ఆ మిద్దె మీదనే యెలాగో గడిపి తెల్లవారుతూనే బయలుదేరి మా దేశం పోతాను," అనుకుంటూండగా, రాజసౌధం లోపలిభాగంలో ఒక కాగడా వెలుగుతూ కనబడింది. ఆ వెలుగులో అంతఃపుర ద్వారం బయట పరుపుమీద పడుకుని గట్టిగా గురకపెట్టి నిద్రపోయే నల్లటి కొజ్జాబానిస కనిపించాడు.



వాడి పరుపు ద్వారానికి అడ్డంగా వేసివున్నది. కాగడా వెలుగులో వాడి కత్తిపిడి నిగనిగా మెరుస్తున్నది. వాడి భోజనంసంచీ ఆ పక్కనే వున్న ఒక నల్ల రాతి స్తంభానికి బిగించబడిన మేకుకు వేళ్ళాడుతున్నది.

ఆ నీగ్రోబానిసను చూస్తేనే రాజకుమారుడికి కంపరం యెత్తింది. అతను ప్రాణాలరచేత బట్టుకుని అడుగులో అడుగువేసుకుంటూ ఆహారపుసంచీని సమీపించి, దాన్ని స్తంభంనుంచి దించి ఇవతలికి తీసుకువచ్చాడు. అందులో రుచికరమైన ఆహారం వున్నది. రాజకుమారుడు దాన్నితిని చావడి మధ్య వున్న జలయంత్రం వద్ద నీరుతాగి, ఆహారపుసంచీని తిరిగి స్తంభానికి తగిలించాడు. నీగ్రోబానిస ఇంకా గురకలుపెట్టి నిద్రపోతూనేవున్నాడు.

రాజకుమారుడు వాడి కత్తిపిడి పట్టుకుని వుపాయంగా కత్తిని ఒరనుండి బయటికి తీశాడు. నిగ్రో లేవలేదు.

రాజకుమారుడు ధైర్యంగా అంతఃపురంలోకి ప్రవేశించాడు. కొంతదూరం వెళ్లేసరికి అతనికి మరొక ద్వారమూ, దానికి అడ్డంగా కట్టివున్న మఖ్మల్ తెరా కనిపించాయి. అతను తెరను తోసుకుని ఒక విశాలమైన పడకగదిలోకి అడుగుపెట్టాడు. ఆ గదిలో దంతంతో తయారుచేసిన ఒక మంచంపైన





ఒక అపూర్వ సౌందర్యవతి నిద్రపోతున్నది. ఆమె ఆ దేశపు రాజుకూతురు. ఆమె మంచానికి నాలుగువైపులా నలుగురు దాసీలు నేలపై పడుకుని నిద్రపోతున్నారు.

రాజకుమారుడు అక్మార్ రాజకుమార్తె సౌందర్యం చూసి విభ్రాంతి చెంది స్తంభంలాగా నిలబడిపోయాడు. అంతలోనే రాజకుమార్తె నిద్ర మేలుకుని కళ్ళు తెరిచి కొత్త మనిషిని చూసి, భయపడటానికి మారుగా, "ఎవరు నీవు?" అని ప్రశ్నించింది.

అక్మార్ ఆమెను సమీపించుతూ, "నిన్ను ప్రేమించి పెళ్ళాడ వచ్చినవాణ్ణి!" అని ధైర్యంగా జవాబిచ్చాడు.



"నిన్ను లోపలికి యెవరు రానిచ్చారు?" అని రాజకుమార్తె మళ్లీ ప్రశ్నించింది. ఆమె పేరు షమ్స్ అల్ నహార్.

"అల్లా రానిచ్చాడు! నా అదృష్టం నన్నిక్కడికి తెచ్చింది!" అన్నాడు అక్మార్.

"నిన్న నన్ను పెళ్ళాడటానికి హిందూ దేశంనుంచి ఒక రాజకుమారుడు వచ్చాడట. కొంపతీసి అది నువేనా? ఆయన అందంగా లేనందున మా నాన్నగారు పెళ్లికి ఒప్పుకోలేదు. నువు అందంగానే వున్నావే?" అన్నది రాజకుమారి నహార్.

ఈ మాట విని రాజకుమారుడు చాలా ఆనందం పొందాడు. అతను జవాబు చెప్పే లోపుగా రాజకుమారి చెలికత్తెలు నలుగురూ మేలుకుని, కొత్తవాణ్ణి చూసి ఎంతో కంగారు పడుతూ, "అమ్మగారూ, ఎవరీ మనిషి?" అని అడిగారు.

"నాకూ తెలియదు. కళ్ళు తెరిచేసరికి ఎదట ప్రత్యక్షమయాడు. నిన్న నన్ను పెళ్ళాడతానని వచ్చిన రాజకుమారుడేమో!" అన్నది నహార్.

"కాదు, కాదు. ఆ మనిషి వికారంగా వున్నాడు. మేము చూశాము," అంటూ దాసీలు కొజ్జావాణ్ణి నిద్రలేపి, "ఏమిరా? ఇదేనా అంతఃపురాన్ని నువు కాపలాకాసే



పద్ధతి ? ఈ మనిషిని లోపలికి రానిస్తావా?" అని తిట్టారు.

నీగ్రోబానిస కంగారుతో కత్తిదూయబోయి తన ఒర ఖాళీగా వున్న సంగతి తెలుసుకున్నాడు. వాడి కంగారు రెట్టింపయింది. వాడు పడకగదిలోకి వచ్చి రాజకుమారుణ్ణి చూసి, "అయ్యో, మీరు మనిషా? దయ్యమా?" అని అడిగాడు.

"నీచుడా, నన్ను దయ్యమంటావా? చూడు నిన్నేం చేస్తానో?" అని అక్మార్ కత్తి దూసి వాడిపైకి వచ్చాడు.

"నన్ను నిష్కారణంగా చంపక, తమరెవరో సెలవివ్వండి!" అన్నాడు బానిస.

"నేను రాజుగారి అల్లుణ్ణి. అందుకనే నాభార్య ఉన్న చోటికి నేను వచ్చాను!" అన్నాడు రాజకుమారుడు.

"చిత్తం, తమరు అలా సెలవిస్తే నేనేమనేది?" అంటూ బానిస అక్కడినుండి పరిగెత్తిపోయి, రాజుగారిని నిద్ర లేపుతూ కంగారుగా కేకలు పెట్టాడు.

రాజుగారు వాడి కంగారు చూసి, "ఏమిట్రా సంగతి? త్వరగా చెప్పు!" అన్నాడు అదుర్దాగా.

"మహారాజా, అమ్మాయిగారి పడకగదిలో ఒక దెయ్యం చేరి తమ అల్లుణ్ణని




చెబుతున్నది. వెంటనే వెళ్లి మీరా దయ్యాన్ని పదలగొట్టండి," అన్నాడు బానిస.

రాజుగారికి వాణ్ణి చంపాలన్నంత కోపం వచ్చింది. "తుచ్ఛుడా, నువ్వక్కడ ఉండి కూడా ఆ దయ్యాన్ని లోపలికి ఎందుకు పోనిచ్చావు?" అంటూ ఆయన గబగబా రాజకుమార్తె పడకగదికి వచ్చి దాసీలతో, "ఏం జరిగింది? ఏమిటిదంతా?" అన్నాడు.

"మేమేమీ ఎరగము, మహారాజా! మాకు నిద్ర మెలుకువ వచ్చేసరికి ఈయన ఎవరో, ఎలా వచ్చాడో గాని, రాజకుమార్తెతో మాట్లాడుతూ మాకు కనిపించాడు," అన్నారు దాసీలు.

రాజుగారు అక్మార్‌ను సమీపించ సాగాడు. ఈలోపుగా రాజకుమారుడు రాజ కుమార్తెను, "ఈయనేనా మీ తండ్రి?" అని అడిగి, ఆమె అవునని తలవూపిన మీదట, కత్తి దూసి రాజుగారిపైకి లంఘిస్తూ పెడబొబ్బలు పెట్టాడు.

అతన్ని చూసి రాజుగారు భయపడి, "తొందరపడకు, కొంచెం ఆగు! ఇంతకూ నువు రాజకుమారుడివా, దయ్యానివా!" అని అడిగాడు.

"నేను సిసలైన రాజకుమారుణ్ణి. మీ కుమార్తె చాలా అందగత్తె అని విని ఆమెను పెళ్ళాడ వచ్చాను గనక సరి పోయింది గాని, నన్ను మరొకరు దయ్యమంటే వారి తల ఈపాటికి ఒక్క వేటుతో ఎగరగొట్టి ఉందును!" అన్నాడు అక్మార్.

"నువు నిజంగా రాజకుమారుడివే అయితే, దొంగతనంగా అంతఃపురంలోకి రావటం దేనికి? పైపెచ్చు నా అల్లుణ్ణని చెప్పుకుంటావా? ఇప్పుడు నా భటులను పిలిపించి నిన్ను చిత్రవధ చేయించానంటే నిన్ను అదుకునే వాడెవడు?" అని రాజు అక్మార్‌ను అడిగాడు.

"మీరు కొంచెంకూడా ఇంగితజ్ఞానం లేకుండా మాట్లాడుతున్నారు. నాకన్న మంచి అల్లుడు మీకెక్కడ దొరుకుతాడు.



అదీగాక భటులను పిలిచి మీ కూతురి పడకగదిలోకి పరాయివాడు ప్రవేశించాడని బయటపెట్టితే అప్రతిష్ఠ మీ కుమార్తెకే కదా?" అన్నాడు అక్మార్.

"అది నిజమే. కాని నా కూతురి పెళ్ళి బహిరంగంగా జరగాలి. ఎవరికీ తెలియకుండా జరిగిపోయిందంటే అదిమాత్రం నాకు అప్రతిష్ఠ కాదా? అందుచేత కాజీ సమక్షంలో నా కూతురును నువే బహిరంగంగా పెళ్ళాడు," అన్నాడు రాజు.

"నా అభ్యంతరం ఏమీలేదు, అలాగే పెళ్ళాడతాను. కాని అందుకు నేను కొన్ని నియమాలు చెబుతాను. వాటికి మీరు ఒప్పుకుంటేనే మీరు కోరిన ప్రకారం పెళ్లి జరుగుతుంది," అన్నాడు అక్మార్.

"ఏమిటా నియమాలు?" అని రాజు అడిగాడు.

"ఒక పద్ధతి ఏమిటంటే మీరు నాతో కత్తియుద్ధం చెయ్యటం. ఈ యుద్ధంలో మీరు ఓడిపోయే పక్షంలో మీ సింహాసనం నాకిచ్చెయ్యాలి. రెండో పద్ధతి ఏమంటే రేపు ఉదయం మీకున్న సైనిక బలాలన్నిటినీ నాపైకి యుద్ధానికి పంపటం. ఈ రెండు పద్ధతులలో దేనికో ఒకదానికి మీరు ఒప్పుకోవాలి. ఇంతకూ మీ కింద ఎంతమంది యుద్ధభటులున్నారు?" అన్నాడు అక్మార్.





"నలభైవేలమంది సైనిక భటులూ, మరి నలభైవేలమంది బానిస భటులూ ఉన్నారు," అన్నాడు రాజు.

"ఆ ఎనభైవేలమందినీ నాపైకి యుద్ధానికి పంపండి. వారు నన్ను చంప గలిగితే మీకుగాని, మీ కుమార్తెకుగాని ఎట్టి అప్రతిష్ఠా ఉండదు. నేను వారిని జయిం చానా నాలాటి అల్లుణ్ణి సంపాదించినందుకు లోకం మిమ్మల్ని మెచ్చుకుంటుంది," అన్నాడు అక్మార్.

రాజు ఈ రెండో పద్ధతికి ఒప్పుకున్నాడు. ఈ కుర్రవాడికి కొంచెం పిచ్చివుండి వుంటుం దనీ, తన భటులచేతిలో అతను తప్పక చస్తాడనీ రాజుకు తోచింది. ఆయన కొజ్జా వాణ్ణి పిలిచి, "ఒరే, నువు మన వజీరు వద్దకు వెళ్ళి, మన సైనికుల నందరినీ మైదా నంలో హాజరుపెట్టమని వుత్తరు విచ్చినట్టు చెప్పు," అన్నాడు.

రాజాజ్ఞప్రకారం మంత్రి ఎనభైవేల మంది భటులనూ మైదానంలో నిలబెట్టిం చాడు. ఇంతలో తెల్లవారింది. యుద్ధం చెయ్యటానికి అక్మార్‌కు ఒక గుర్రంకావాలి గనక, రాజుగారు తన నౌకర్లను పిలిచి, "మన అశ్వశాలలో వున్న గుర్రాలన్నిటిలోకీ మంచి గుర్రంగా చూసి దాన్ని వెంటనే



యుద్ధానికి ఆయత్తంచేసి యిక్కడికి పట్టుకు రండి!" అన్నాడు.

ఈ మాటలు విని అక్మార్, "మహారాజా, ఇక్కడికి నన్ను తెచ్చిన గుర్రం వున్నది. నాకు వేరే గుర్రం అవసరంలేదు," అన్నాడు.

"సరే, నీయిష్టం!" అంటూ రాజుగారు అక్మార్‌ను వెంటబెట్టుకుని మైదానంవద్దకు బయలుదేరాడు.

అక్కడ సైనికులు యుద్ధసన్నద్ధులై బారులుతీరి నిలబడివున్నారు. వారితో రాజు గారు ఇలా అన్నాడు :

"సైనికులారా, ఈ యువకుడు నా కుమా ర్తెను వివాహం చేసుకుంటానని వచ్చాడు.



తాను చాలా పరాక్రమవంతుణ్ణనీ, మిమ్మల్నందరినీ ఒంటరిగా జయించగలననీ అంటున్నాడు. ఇది నిజమైతే సంతోషించదగినమాటే గాని, అబద్ధమైన పక్షంలో ఇంతకంటె దుస్సాహసం మరొకటి వుండదు. అందుచేత ఇతను మీపైకి వచ్చినప్పుడు మీరు దయాదాక్షిణ్యాలు లేకుండా ఇతనితో యుద్ధంచేయండి!" తరవాత రాజుగారు అక్మార్‌కేసి తిరిగి, "ఇక నువ్వు యుద్ధం ప్రారంభించవచ్చు!" అన్నాడు.

"ఇది చాలా అన్యాయం. కాళ్ళపై నిలబడివున్న నేను ఇంతమందితో ఎలా పోరగలను?" అన్నాడు అక్మార్.

"మరి నేను గుర్రాన్ని యిస్తానంటే యెందుకు వద్దన్నావు? ఇప్పటికైనా మించి పోయిందిలేదు, గుర్రాన్ని సిద్ధంచేయించమంటావా?" అన్నాడు రాజు.

"నే నెక్కివచ్చిన గుర్రం వున్నది, మహారాజా. నాకు వేరే గుర్రం అవసరంలేదు," అన్నాడు అక్మార్. "ఆ సంగతి లోగడే చెప్పావు! ఇంతకూ ఆ గుర్రం ఎక్కడ వున్నది?" అన్నాడు రాజు.

"అది మీ భవనం మిద్దెపైనే వున్నది," అన్నాడు అక్మార్.

"మిద్దెపైననా?" అన్నాడు రాజు ఆశ్చర్యంతో. ఈ కుర్రవాడికి మతి సరిగా లేదన్న అనుమానం మరొకసారి ఆయనలో తల ఎత్తింది. "గుర్రం మిద్దెపైన ఎలా వుంటుంది? అయినా చూస్తాం?" అంటూ ఆయన తన సేనానాయకుణ్ణి దగ్గిరికి పిలిచి, "రాజభవనంపైన మిద్దెమీద ఏమున్నదో చూసి వెంటనే ఇక్కడ వున్నట్టు తిరిగిరా. అక్కడ ఏమైనా కనిపిస్తే దాన్ని వెంటపట్టుకురా!" అన్నాడు.

అక్కడ చేరిన ప్రజలు తమలో తాము, "గుర్రం ఎక్కడైనా మెట్లెక్కి మిద్దెమీదికి పోవటం వుందా? ఏమిటీ ఆశ్చర్యం?" అని గుసగుసలాడారు. —(ఇంకా వుంది)





# కాకోలూకీయం

స్థిరజీవి :

వినిపింతు నా కథ - వినుమయ్య రాజ
వనమున నున్నట్టి - పక్షులవెల్ల
మునుపొకసారి చే-రెను సభగాను
ఘనుడైన తమ రాజు - గరుడుని గూర్చి.
తమ రాజు గరుడుడు - తమ గతి గనక
విమతియై యెచటనో - విడిపోయి యుండె
వానితో నేమి వే-రే నాయకునిగ
వేనినో చేసిన - విడ్డూరమేమి?
అనుకొని ఆ పక్షు - లంతట నొక్క
రిని పక్షిరాజుగా - నొనరింప దలచె.
ఎవరు రాజని పెక్కు - లేవేవొ తలచి
కువ కువ అఱచుచు - గువ్వలవెల్ల
కోరి రాజును గుడ్డ-గూబను జేయ
తీరుమానము జేసి - తెఱ విది యనిరి.
సరియన్న సరియంచు - సంబరపడుచు
సరి పక్షులెల్ల సై-సై అన్నవెంట
గూబకు పట్టమ్ము - కోరి కట్టంగ
ఆ బంధుతతి యెల్ల - అట్టహాసముగ
పనులెల్ల చేసిరి, - పట్టాభిషేక
మునకు వనమ్ములో - మొనకొనినారు.
ఈలోన నెచటికో - ఏగిన కాకి
చాలించి వేటను - చక్కగా వచ్చె.
పరప వోలిక నున్న - పక్షి కులమ్ము
పరికించి ఏమని - ప్రశ్నించె నంత
మనుషులలో కెల్ల - మంగలి గడుసు
కన పక్షులందెల్ల - కాకియే గడుసు
కోరజంతుల నక్క - కొండంత గడుసు
మీరిన మునుల పం-డారియే గడుసు
కాకి నాలోచింప-కయ సేయు టేల
ఈ కార్యమని పక్షు - లెల్ల విన్పించె.
కాకి కదేమి చ-క్కగ తోచలేదు.
ఈక పక్షులివన్ని - యిట చేరియుండ
పగటి చూపే లేని - పాడు మొగమ్ము
తగదురా గూబ పె-త్తనము సేయంగ
మఱి మన రాజు ఆ - గరుడు డేమయ్యె?

విద్వాన్ విశ్వం



పరికించ లేదంచు - పరితాప మేల ?
అయన రాజన్న - నంతియే చాలు
ఏ యుపాయము రాక - యిటు లుండపచ్చు.
శశి పేరుతో కాన - శశకమ్ము లెల్ల
యుశముతో నుండు ట-య్యది వినలేదె
అని కాకి ఎదిరింప - నా పక్షులెల్ల
వినిపింపు మది యెట్లొ - వినిపింపు మనిరి

కాకి చెప్పిన కథ :

అడవిలో నొక్క మ-హా గజమ్ముండె
అడవియేన్గుల కెల్ల - నది రాజరాజు.
ఒకపరి కాటక - మ్మూచె నా యడవి ;
సకల హ్రదమ్ముల - జల మింకిపోయె.
నో రెండిపోయి ఏ-న్గుల పిల్లలెల్ల
ఘోరమ్ముగా చచ్చె - కొన్ని కృశించె.



ఇది చూచి గజరాజు - ఏన్గుల బిలిచి
పదిమంది చూడని - పట్టున నున్న
మడు గొక్కటున్నది - మంచినీ రుండు
దడదడ వెళ్ళు డా-దారిని బట్టి
అని చెప్ప నవి యెల్ల - నచటికి నేగి
తనివి దీరగ నీట - తానమ్ములాడి
నోరార గ్రోలి ఆ-నీరమ్ములెల్ల
ఆ రవి మున్గగా - నట వీడి చనియె.
ఆ మడుగున్న తా-వంతయు నిండి
కోమల దేహులౌ - కుందేళ్ళు కలవు.
ఏనుగు మంద కా - ళ్ళటు నటు తగిలి
వేనవేల్ కుందేళ్ళు - విలవిలలాడె.
కన్నులు కాళ్ళు చ-క్కని చెవుల్ తెగిన
కొన్ని కుందేళ్ళు - ఆక్రోశించి పోయె
ఒకచోట సభ చేసి - ఇక దారి యేది
సకల నాశమ్మగు - సందేహ మేల ?
కానలో నీరున్న - కోన ఇదొకటె
ఏనుగు లిటు వచ్చు - నిక రోజురోజు.
తాకిన చాల్ చంపు - తప్పక గజము
నాకిన చాల్ చంపు - నాగుబా మెపుడు
నవ్వుచునే చంపు - నరనాథు డింక
దువ్వుచునే చంపు - దుర్మార్గుడన్న.
అని తలపోయుచుం-డిన నొక్క టనియె
మనకున్న దొక్కటే - మార్గము నుండు.
తనవాని విడవలె - తన గుంపుకొఱకు
తన గుంపు విడవలె - తన ఊరికొఱకు



తన ఊరు విడవలె - తన నాడుకొఱకు
తనకోస మీ భూమి - తఱలి పోవలయు
అన్నాడు వ్యాస మ-హా మునీంద్రుండు
క్రన్నన వేఱొక్క - కాన కేగుదము.
ఆ మాట కవియెల్ల - నౌనన లేదు
ఏమి సేయక పోవు - టేమి బాగనుచు
విసమున్న లేకున్న - పెద్దగా పడగ
విసవిస విదిలించు - పస గల నాగు.
ఒక దూత పంపి ఎ-ట్లో గజరాజు
ఇక రాకయుండు న-ట్లే సేయవలయు.
ఇటు మంతనము లాడి - ఏవొ యోచించి
పటు దూతగా గజ - పతి కడకంపె.
లంబకర్ణ మ్మను - లావు కుందేలు
సంబరమ్ముగ నేగు - సాగి ఏతెంచు
దారిలో నెత్తైన - తావున నిలిచి
ఓరి గజేంద్ర పో-వోయి అంచనియె.
ఆపెద వెవ్వడ-వని ఏను గడుగ
ఆ పెను కుందేలు - తీపిగా చెప్పె.
ఈ కోస చంద్రుని - దిచట కుందేళ్ళు
మూకలు మూకలు - ముద్దుగా నుండు.
మారాజు చందమా-మయె నన్ను పంచె
ఈ రీతి నీవు రా- నెంతొ కోపించె.
అన్న ఆ మాటకు - ఆ ఏన్గురాజు
అన్న, మీ రాజేడ - నున్న వాడనియె ?
అదిగొ మా మడుగులో - నాయన కలడు
ఎద విచ్చి కుందేళ్ళ - కెదొ చెప్పుచుండె.



అని చెప్పి కుందేలు - నా గజరాజు
మునుకొని నడిపించి - కనిపింప జేసె
మడుగులో చంద్రబిం-బమ్ము క్రీనీడ
గడగడ లాడె నా-గజరాజు చూచి.
ధ్యానమ్ములో నుండె - తగ చంద్ర రాజు
కాన మాట్లాడడు - కడ చనుమన్న
కుందేలు మాట ని-క్కువముగా తలచి
పందెమ్ము పర్వున - పాఱె నేనుగులు.

* * *

పెద్దగా పేరున్న - పెద్ద రాజగును
మొద్దును రాజుగా - ముడుచుకోరాదు.
నీచు రాజుగ జేసి - నేల పాలైన
ఆ చరిత్రను వింతు - నాలకించండి.

# తమాషాలు

1. ఇంగ్లీషునెలలలో సెప్టెంబరు, అక్టోబరు, నవంబరు, డిసెంబరు అనే పేర్లుండటం మీకు తెలుసు. కాని ఈ పేర్లలో ఒకచిత్రం గమనించారా? ఈ పేర్లలో సప్త, అష్ట, నవ, దశ—ఏడు, ఎనిమిది, తొమ్మిది, పది—అనే పదా లున్నాయి. వీటినిబట్టి మనం సెప్టెంబరు ఏడవనెల అనీ, అక్టోబరు ఎనిమిదవ నెల అనీ, నవంబరు తొమ్మిదవనెల అనీ, డిసెంబరు పదవనెల అనీ అను కుంటాం. అయితే ప్రస్తుతంవుండే ఇంగ్లీషు సంవత్సరంలో ఇవి తొమ్మిదవ, పదవ, పదకొండవ, పన్నెండవ మాసాలుగా వుంటున్నాయి? ఇందుకు కారణమేమిటి?

[సమా: జూలియస్ సీజర్‌కు పూర్వం రోమనులు మార్చిమాసంతో సంవత్సరాన్ని ప్రారంభించేవారు. అప్పుడు వారి సంవత్సరాది మన సంవత్స రాదికి సమీపంగా వుండేది. అయితే తరువాత ఈ పద్ధతి మారి జనవరితో సంవత్సరం ప్రారంభంకావటం జరిగింది. అందుచేత ఈ నెలల పేర్లకూ, వాటి సంఖ్యకూ తేడా ఏర్పడింది.]

2. మూడు అంకెలుగల సంఖ్య తీసుకోండి. ఆ మూడు అంకెల సరసను అవే మూడు అంకెలువేసి ఆ సంఖ్యను ఆరు అంకెలుగల సంఖ్య చెయ్యండి. ఇప్పుడా ఆరు అంకెల సంఖ్యను మొదట 7 పెట్టి భాగించండి, శేషం మిగలదు. అలా భాగించగా వచ్చిన సంఖ్యను ఇప్పుడు పదకొండుపెట్టి భాగించండి, శేషం మిగలదు. రెండవసారి భాగించగా వచ్చిన సంఖ్యను 13 చేత భాగించండి, శేషం మిగలదు. మూడవసారి భాగించిన తరవాత మిగిలే సంఖ్య మొట్టమొదట మీరుతీసుకునే మూడు అంకెల సంఖ్యే!

[ఇందులో వింత ఏమీలేదు. మాటవరసకు 365 అనే సంఖ్య తీసుకున్నా మనుకోండి. దాన్ని 3,65,365 అనే సంఖ్యను చేయుటమంటే 365 ను 1001 సంఖ్యతో గుణించటమేగదా. 1001 లో 7, 11, 13 సరిగాపోతాయి. $7 \times 11 = 77$; $77 \times 13 = 1001$.]




## 13

[రూపధరుడి జాడ ఏమీ తెలియనందున అతను చనిపోయాడనుకుని అనేకమంది రాజ కుమారులు రూపధరుడి ఇంట బసచేసి, రూపధరుడి భార్యను తమలో ఒకరిని పెళ్ళాడ మని నిర్బంధించసాగారు. పసివాడైన రూపధరుడి కుమారుడు ధీరమతి తన తండ్రి వార్తలకోసం ఒక నౌకలో బయలుదేరి నవద్యోతుణ్ణీ ప్రతాపుణ్ణీ చూడబోయాడు.]

ఈలోపల ఇథకాలో, రూపధరుడి ఇంట చేరిన యువకులు నిశ్చింతగా తింటున్నారు, తాగుతున్నారు, జూదాలాటతో కాలం వెళ్ల బుచ్చుతున్నారు. ధీరమతి పైలాస్‌కు ప్రయాణమై వెళ్లిన సంగతి వారికి తెలియదు. ఇంటిబయట జూదాలాడుతున్న ఈ దుర్మార్గుల వద్దకు ఒక యువకుడు వచ్చి, దుర్బుద్ధి అనేవాడితో, "అయ్యా, పైలాస్ నుంచి ధీరమతి ఎప్పుడు తిరిగివస్తాడో తమకు తెలుసా? ఎందుకంటే అతను నా పడవ తీసుకువెళ్లాడు. నాకా పడవతో పని వచ్చింది. నేను అవతలి ఒడ్డుకు పోయి ఒక అడవిగుర్రాన్ని తెచ్చుకుందామనుకుంటున్నాను," అన్నాడు.

అందరు ఒకరి మొహాలు ఒకరు చూసుకుని ఆశ్చర్యపోయారు.

దుర్బుద్ధి ఆ యువకుడితో, "ధీరమతి పైలాస్‌కు వెళ్లాడా? నీ పడవ కాజేశాడా? నిన్నడిగే తీసుకుపోయాడా? ఇదంతా ఎప్పుడు జరిగింది? ఆ పడవకు నావికు





లెవరు? ధీరమతి నౌకర్లా, లేక ఊళ్లో ఉండే యువకులా? అసలు ధీరమతి ఏ పనిమీద పైలాస్‌కు వెళ్లాడు?" అని ప్రశ్నలవర్షం కురిపించాడు.

"నా యిష్టంమీదే పడవను తీసుకు పోయారండి. అంతవారు వచ్చి అడిగితే ఎలా లేదనను? ఊళ్లో ఉండే జమా జట్టీల్లాటి కుర్రాళ్లు నావికులుగా వెళ్లారండి. సహనుడు వాళ్లకు నాయకుడుగా వెళ్లాడు," అని ఆ వచ్చిన యువకుడు దుర్బుద్ధికి జవాబు చెప్పాడు.

దుర్బుద్ధి కళ్లవెంట నిప్పులు రాలాయి. అతను తన అనుచరులకేసి తిరిగి, "ఇది సహించరాని సంగతి! మనందరి కళ్లలోనూ దుమ్ముగొట్టి ఈ కుర్రకుంక పడవ చేసుకుని, నావికులను సమకూర్చుకుని వెళ్లిపోతాడా! శరవేగంతో వెళ్లే పడవ ఒకటి సంపాదించండి. ఇరవైమంది నావికులను పోగు చెయ్యండి; నేను ధీరమతి అంతు తేలుస్తాను," అన్నాడు.

తరవాత నలుగురూ చేరి రహస్యాలోచన చేశారు. ధీరమతి పైలాస్ నుంచి తిరిగి వచ్చే దారిలో పొంచిఉండి, దుష్బుద్ధి అతన్ని చంపెయ్యాలని నిశ్చయించారు.

వాళ్లు చేసే కుట్రనుగురించి పద్మముఖికి నౌకర్లద్వారా తెలిసింది. తన ఇంట చేరిన దుర్మార్గులు తన కొడుకును చంప యత్నిస్తున్నారని వినేవరకు అమెకు ధీరమతి ప్రయాణమై వెళ్లిన సంగతే తెలియదు.

"ఇంతమంది నౌకర్లుండి నా కొడుకు సముద్రాలపై వెళ్లిపోతూంటే ఒక్కరూ నాతో చెప్పలేదు. నాకు తెలిస్తే వాణ్ణి వెళ్ల నివ్వను!" అని పద్మముఖి ఏడ్చింది. ఆమెతోబాటు ఆమెయింటవున్న పరిచారికలందరూ ఏడ్చారు.

"పెళ్లికూతురు పెళ్లికోసం ఏడుస్తున్నట్టున్నది. తన కొడుకు పోతాడని తెలియదు, పాపం!" అన్నాడొక దుర్మార్గుడు.



"మీరెవరూ నోరు పారేసుకోవద్దు. ధీరమతి హత్యగురించి పురుగుకైనా తెలియనివ్వకండి," అంటూ దుర్బుద్ధి తన అనుచరులలో సమర్థులను ఇరవైమందిని ఎన్నుకుని, వారితో సముద్రతీరానికి వెళ్లాడు. వారు ఒక పడవలో కత్తులూ కటార్లూ పెట్టుకుని, తెడ్లు అమర్చి తీరానికి దూరంగా లంగరు వేశారు. తరవాత వారు తీరాన భోజనం చేసుకు తిని రాత్రికోసం ఎదురు చూడసాగారు.

ఆ రోజు పద్మముఖి భోజనం చెయ్యలేదు. ఆ రాత్రి ఆమెకు నిద్రకూడా సరిగా లేదు. తాను తన కొడుకునే చూస్తానో, కొడుకు శవాన్నే చూస్తానో అని ఆమె వాపోవసాగింది. ఆ సమయాన ఆమెకు చీకట్లో తన సోదరి ఆకారం కనిపించి, "ఎందుకు దుఃఖిస్తున్నావు, అక్కా? నీ కొడుకుకు ఏ ప్రమాదమూ రాదు," అని చెప్పి చూస్తుండగానే మాయమయింది.

ఆ రాత్రే దుర్మార్గులు తమ పడవను ఒక రాళ్లగుట్టల దీవికి తీసుకుపోయి అక్కడ లంగరువేసి, ధీరమతికోసం ఎదురు చూడసాగారు.

ఈలోపుగా అక్కడ ధీరమతి ప్రతాపుడికి వీడ్కోలుచెప్పి, అయననుంచి అనేక బహు



మానాలు పొంది బయలుదేరాడు. అతను సముద్రతీరాన్ని చేరుకుని, తన నావికులను కలుసుకుని దేవతలకు బలులిచ్చి నౌకలో ఇంటికి ప్రయాణమయాడు. అయితే అతను నౌకను నేరుగా నగరానికి నడపక మరొక రేవు వద్దకు పట్టించి అక్కడ తాను దిగి, తన అనుచరులతో, "మీరు నగరానికి వెళ్లండి. నేను మా పందులకాపరిని ఒకమారు కలుసుకుని నగరానికి వస్తాను," అని చెప్పాడు.

ధీరమతి పందులకాపరి గుడిసె వద్దకు చేరుకునే సమయానికి రూపధరుడూ, పందులకాపరీ గుడిసెలోనే ఉండి వంట





చేసుకుంటున్నారు. గుడిసె బయట ఉన్న జాగిలాలు నాలుగూ ధీరమతిని చూసి గుర్తించి, తోకలాడిస్తూ, సంతోషంగా అతని పైకి దూకాయి.

"ఎవరో వచ్చారు. నీకు తెలిసినవాళ్లో, నీ స్నేహితులో అయి ఉండాలి. ఎందుకంటే కుక్కలు మొరగటానికి బదులు, మారాం చేస్తున్నాయి," అని రూపధరుడు పందులకాపరితో అన్నాడు.

రూపధరుడు మాట్లాడటం పూర్తిచేసే లోపుగానే ధీరమతి గుడిసెద్వారంలోకి వచ్చి నిలబడ్డాడు. అతన్ని చూస్తూనే పందులకాపరి సంభ్రమంతో లేచి, తన



యజమానిదగ్గిరికి పరిగెత్తి, ఏ దూరదేశం నుంచో తిరిగివచ్చిన కొడుకును కౌగలించుకున్నట్టు కౌగలించుకుని, "వచ్చావా, నాయనా? నిన్ను మళ్లీ ఈ కళ్లతో చూస్తాననుకోలేదు. లోపలికి రా, బాబూ. అసలు నువు నా గుడిసెకు వచ్చేదే అరుదు. పైలాస్‌కు వెళ్లావుటకాదూ?" అన్నాడు. అతని కళ్లవెంట ఆనందబాష్పాలు రాలాయి.

"అక్కడినుంచే వస్తున్నాను, చిన్నాయినా. మా ఇంటి విశేషాలేమిటి? మా అమ్మ క్షేమంగా ఉందా? లేక ఎవరైనా ఆవిడను పెళ్ళాడేశారా?" అని ధీరమతి అడిగాడు.

"అటువంటి దేమీలేదు, బాబూ. ఆవిడ ఎప్పటిలాగే వుంది. అయితే ఆవిడకు రాత్రింబగళ్ళు దుఃఖం తప్ప మరొకటిలేదు," అన్నాడు పందులకాపరి, ధీరమతి చేతిలో వున్న ఈటె తీసుకుంటూ.

ధీరమతి లోపలికి రావటంచూసి రూపధరుడు లేచి అతనికి చోటివ్వబోయాడు. కాని ధీరమతి, "లేవకు, తాతా. నేను కూర్చునేటందుకు ఇంకో ఆసనం దొరక్కపోదులే!" అన్నాడు.

రూపధరుడు మళ్ళీ కూచున్నాడు. పందులకాపరి ధీరమతికోసం ఒక చర్మం





పరిచి కూచోబెట్టాడు. తరవాత ముగ్గురూ కూచుని భోజనం చేశారు. భోజనం అయాక ధీరమతి పందులకాపరితో, "చిన్నాయినా, ఈ కొత్తమనిషి ఎవరు? ఈయనను ఎవరు ఇక్కడికి తెచ్చారు?" అని అడిగాడు.

"బాబూ, ఈయన క్రీట్ దేశస్థుడనని చెబుతున్నాడు. ప్రపంచమంతా తిరిగాడట. ఆయన లోకసంచారం చేయాలని దేవుడు రాసిపెట్టినట్టుంది. ఆయన ప్రమాదంనుంచి తప్పించుకుని నా గుడిసెలో తల దాచుకున్నాడు. ఆయనను నీ చేతుల్లో పెడుతున్నాను, నీ యిష్టంవచ్చినట్టు చెయ్యి," అన్నాడు పందులకాపరి.



"నాకు ఎటువంటి పరీక్ష పెట్టావు, చిన్నాయనా! ఈ అతిథిని నా యింటి కెలా తీసుకుపోగలను? నేను చిన్నవాణ్ణి, నా యింటినిండా శత్రువులేనాయె! వాళ్ళంతా పెళ్ళిచేసుకోమని తొందరపెడుతూంటే ఏమీ నిర్ణయించలేని స్థితిలో ఉన్నది మా అమ్మ. అందుచేత నేను ఈయనకు చేయగల సహాయం ఏమంటే, వేసుకునేటందుకు బట్టలిస్తాను, పాదరక్షలిస్తాను, పదునైన కత్తి ఇస్తాను. ఆయన ఎక్కడికి పోదలిస్తే అక్కడికి వెళ్ళమను; లేదా, నీ గుడిసెలోనే ఉంచుకుని ఆయన యోగక్షేమాలు చూడు. ఆయన పోషణభారం నీపైన లేకుండా, నే నాయనకు కావలసిన తిండీ బట్టా పంపుతాను. అంతేగాని ఆ దుర్మార్గుల మధ్యకు ఆయన రావటం నాకిష్టం లేదు. వాళ్ళాయనను చాలా హింస పెడతారు. ఆ అవమానాన్ని నేను సహించలేను," అన్నాడు ధీరమతి.

తరవాత అతను పందులకాపరితో, "చిన్నాయనా, నువు వెంటనే మా ఇంటికి వెళ్ళి. మా అమ్మను ఒంటరిగా పిలిచి, నేను పైలాస్‌నుంచి తిరిగివచ్చాననీ, నీ గుడిసెలో ఉన్నాననీ, నాకోసం విచారించవద్దనీ చెప్పు," అన్నాడు.






"బాబూ, మీరు ప్రయాణమై వెళ్ళినది మొదలు మీ తాతగారు అన్నం ముట్టలేదుట. ఆయనకుకూడా మీరు తిరిగివచ్చిన వార్త చెప్పిరానా? పాపం, పెద్దవాడు!" అన్నాడు పందులకాపరి.

"నువు మరెక్కడికీ వెళ్ళకు. వీలు చూసుకుని మా తాతకు ఏ పనిమనిషి ద్వారానో కబురు పంపమని మా అమ్మతో చెప్పి నువు వెంటనే యిక్కడికి తిరిగిరా!" అన్నాడు ధీరమతి.

పందులకాపరి బయలుదేరి వెళ్ళాడు. గుడిసెలో తండ్రికొడుకు లిద్దరు మాత్రమే ఉండిపోయారు.



అకస్మాత్తుగా గుడిసెబయట రూపధరుడికి బుద్ధిమతీదేవి ప్రత్యక్షమై, బయటికి రమ్మని సంజ్ఞ చేసింది. రూపధరుడు ఒంటరిగా బయటికి వెళ్ళాడు. ఆ దేవి అతనితో, "నీ కొడుకుతో నువ్వెవరో చెప్పేసి, అతని సాయంతో నీ శత్రువులనందరినీ నాశనం చెయ్యటానికి ఉపక్రమించు. మీ ఇద్దరికీ నేను అండగా ఉన్నాను గనక, మీరు భయపడ నవసరంలేదు," అంటూ రూపధరుణ్ణి తన దండంతో తాకింది.

వెంటనే రూపధరుడి మొహాన ముడతలన్నీ పోయి పడుచువాడయాడు. అతని దుస్తులుకూడా మారిపోయాయి. ఇలా మారి లోపలికి వచ్చిన రూపధరుణ్ణి చూసి ధీరమతి నిర్ఘాంతపోయాడు. "అయ్యా, మీరెవరు? ఎవరో దేవత అయి ఉండాలి. మామూలు నరులు ఇలా తమ రూపాన్ని మార్చుకోలేరు. అదీగాక నరులకు ఈ తేజస్సు ఉండదు!" అన్నాడు.

రూపధరుడు తనను తాను బయటపెట్టుకున్నాడు.

"నేను నీ తండ్రిని, రూపధరుణ్ణి, నాయనా! చాలా కష్టాలు పడి చివరకు స్వదేశం చేరుకున్నాను," అంటూ అతను కొడుకుతో తన కథ యావత్తూ చెప్పి, "మన





ఇంటు ఎంతమంది దుర్మార్గులున్నారో చెప్పు! వారిని మనం కడతేర్చుదాము," అన్నాడు.

"అందరూ కలిసి నూట ఎనిమిదిమంది ఉన్నారు. వీరు గాక అరుగురు నౌకర్లున్నారు. వీరందరినీ మనిద్దరమూ ఎలా కడతేర్చ గలం, నాన్నా ?" అని ధీరమతి అడిగాడు.

"పిచ్చివాడా, మనం ఇద్దరమే అను కుంటున్నావు గాని, మనవెంట బుద్ధిమతీ దేవి సహాయం ఉన్నది. అందుచేత తెల్ల వారేసరికల్లా నువు ఇంటికి వెళ్ళు. నేను బిచ్చగాడి రూపంలో మన పందులకాపరి వెంట అక్కడికి వస్తాను. ఆ దుర్మార్గులు నన్ను ఎన్నిరకాల అవమానాలుచేసినా నువు సహించి ఊరుకో. కాని నాకేసి ఒక కన్ను ఉంచు. నేను సంజ్ఞ చేసినప్పుడు నువు గోడలమీద ఉండే కత్తులూ, కఠార్లూ తీసి మేడమీద గదిలో ఒక మూల దాచెయ్యి. ఆయుధాలేమైనాయని వాళ్ళెవరైనా అడిగితే, తుప్పుపట్టటంచేత తీసి దాచానని మర్యా దగా చెప్పు. కాని మన ఇద్దరికీ కావలసిన ఆయుధాలు—రెండు ఈటెలూ, రెండు కత్తులూ, రెండు తోలుడాళ్ళూ—అందు బాటులో ఉంచు. నువు జాస్తిగా తాగి ఎవరితోనూ జగడం పెట్టుకోకుసుమా, మన పని కాస్తా పాడవుతుంది. మరొక ముఖ్య



విషయం—నేను తిరిగి వచ్చానన్న సంగతి ఒక్క పురుగుకుకూడా తెలియరాదు—మీ అమ్మకుకూడా చెప్పకు. ప్రస్తుతానికి ఈ సంగతి మన ఇద్దరికి మాత్రమే తెలిసి వుండాలి," అని రూపధరుడు తన కొడుకుతో చెప్పాడు.

ఈలోపుగా, ధీరమతి పైలాస్‌నుంచి తిరిగి వచ్చిన పడవ నగరం చేరింది. ఆ పడవ నడిపినవారిలో ఒకడు రూపధరుడి ఇంటికి వచ్చాడు. ఆ మనిషీ పందులకాపరీ ఒక సారే ఇంటిముందు తారసిల్లారు. పద్మ ముఖికి ధీరమతి రాకగురించి చెప్పటానికి నావికుడు వచ్చిన సంగతి తెలుసుకుని ఆమె

ఇంట చేరిన దుర్మార్గులు కలవరంచెందారు. ధీరమతిని దారిలో చంపెయ్యటానికి వెళ్లిన వారుకూడా తిరిగివచ్చారు.

వారందరూ కలిసి ఒక రహస్య సమావేశం చేశారు. అప్పుడు వారితో దుర్బుద్ధి ఇలా అన్నాడు :

"ఈసారికి వీడు ప్రాణాలతో బయట పడ్డాడు. కాని వీణ్ణి త్వరలో చంపకపోతే మనకు ప్రమాదం వుంది. అసలే ప్రజలు మనపట్ల విముఖులుగా వున్నారు. వీడు వచ్చి అందరితోనూ మన హత్యాప్రయత్నంగురించి చెప్పేస్తాడు. అప్పుడు ప్రజలు మనల నందరినీ దేశంనుంచి తరిమేస్తారు. అందుచేత మనం ఈ ధీరమతిని నగరం ప్రవేశించే సమయంలో హతమార్చి వాడి ఆస్తిని పంచుకోవాలి. మనలో ఎవడు పద్మముఖిని పెళ్ళాడితే వాడికి రూపధరుడి ఇల్లు దక్కుతుంది. అలాకాక మనం ధీరమతిని బతకనివ్వ దలచిన పక్షంలో మనం రూపధరుడి ఇంట వుండే అవకాశంలేదు. ఎవరి ఇంట వారుండి పద్మముఖిని పెళ్ళాడే ప్రయత్నం చేయటం బాగుంటుంది. ఎలా నిర్ణయిస్తారో చెప్పండి!"

ధీరమతిని హత్యచేసే ప్రయత్నానికి కొందరు అభ్యంతరం చెప్పారు. "ధీరమతికి చచ్చే యోగం వున్నదీ లేనిదీ తెలుసుకోకుండా మనం ఏమీ చేయగూడదు. చచ్చే యోగం వున్నట్టు దేవతలు చెబితే ఆ హత్యను నేనే స్వయంగా చేస్తాను. అంతదాకా మనం తొందరపడవద్దు!" అన్నాడొకడు. ఈ సలహాను అందరూ ఆమోదించి ఇంటికి తిరిగి వెళ్ళారు.

ఆ సాయంకాలం పందులకాపరి తిరిగి తన గుడిసెకు వచ్చేలోగా బుద్ధిమతీదేవి మళ్ళీ రూపధరుడి ఆకారాన్ని గుర్తించ రాకుండా మార్చేసింది. ఆ రాత్రి భోజనాలయాక ధీరమతి తన తండ్రితో బాటు పందులకాపరి గుడిసెలోనే నిద్రపోయాడు.

—(ఇంకా వుంది)



# ఆవు అష్టకం

ఒక రైతు దగ్గర ఒక పొట్ల ఆవుండేది. కొంతకాలాని కది ఎండిపోయింది. అందు చేత రైతు దాన్ని అమ్మటానికి సంతకు తీసుకుపోయాడు.

అనేకమంది వచ్చి ఆవును బేరంచేశారు. కాని వారితో రైతు, "ఈ ఆవా? ఇది ఎండిపోయింది. చుక్క పాలివ్వదు. పైగా పొడుస్తుంది!" అని చెబుతూ వచ్చాడు. అందుచేత దాన్ని ఎవరూ కొనలేదు.

ఇదంతా చూసి ఒక పశువుల బేరగాడు, "నీకు ఆవును ఎలా అమ్మాలో బొత్తిగా తెలీదు. నాకియ్యి, నేను క్షణంలో అమ్మిపెడతాను," అన్నాడు.

"అంతకన్న కావలిసిందేమిటి?" అంటూ రైతు ఆవు పలుపు బేరగాడి చేతిలో పెట్టాడు.

వెంటనే బేరగాడు ఎలుగెత్తి, "మంచి బేరం! మంచి సాధువైన ఆవు! పూటకు మూడుశేర్ల పాలిస్తుంది! కావలిసినవారు తొందరపడండి. పోతే రాదు!" అంటూ కేకలుపెట్టసాగాడు.

"పూటకు మూడు శేర్ల పాలే? అంత పాలిచ్చే మంచి ఆవును నేను మాత్రం దేనికి అమ్ముతానూ?" అంటూ రైతు బేరగాడి చేతిలోనుంచి పలుపు లాక్కొని, ఆవును ఇంటికి తీసుకుపోయాడు.





# దేవుడి పళ్లెం

కృష్ణానదీ తీరాన ఒక గ్రామంలో సౌభాగ్యమ్మ అనే ఒక వృద్ధురాలు ఉండేది. ఆమెకు ఎనభై ఏళ్లు. ఆమె కడుపున పుట్టిన కొడుకు లిద్దరూ అర్ధాయుస్సుగానే చని పోయారు. కూతుళ్లు కాపరాలకు వెళ్లి పోయారు. ఆమె చాలామంది మనవరాళ్లను కూడా ఎత్తుకున్నది. కాని ఆమెకు మనవడు గోపన్న ఒక్కడే. "వీణ్ణి పెంచి పెద్ద చెయ్యటానికే నేను బతికి ఉన్నాను," అని ఆవిడ అనేది. వాణ్ణి ఆవిడ చాలా కష్టపడి పెంచింది.

గోపన్న చూడ ముచ్చటయిన యువకుడుగా తయారయాడు. వాడు అందంగా ఉండటమే గాక, బలిష్ఠంగా ఉండేవాడు. వాడు చాలా మంచివాడు. వాడి హృదయంలో ఏకోశానా ఒక్క కుళ్లుబుద్ధి లేదు. వాడికి గల ఆస్తి యావత్తూ ఒక ఎద్దులబండి మాత్రమే. వాడా బండిని కిరాయికి తోలుకుని ఆ వచ్చిన డబ్బుతో తనను తన చెల్లెళ్లను పోషించుకుంటూ తన నాయనమ్మను సుఖపెట్టసాగాడు.. వ్యవసాయ తరుణం కానప్పుడుకూడా అతని బండికి పని ఉండేది. ఆ ఊరు కుమ్మరులకు ప్రసిద్ధి. వాళ్లు చేసిన కుండలూ, కూజాలూ, పాత్రలూ బస్తీకి చేరవేయటానికి గోపన్న బండి ఉపయోగపడేది.

గోపన్న ఇంటి గోడకు ఒక సంచీ వేళ్లాడుతూండేది. ఆ సంచీలో దేవుడి పళ్లెం ఉందనీ, అది అన్ని కష్టాలనూ పారదోలి మేలు కలిగిస్తుందనీ, దాన్ని చేతితో అంటనుకూడా అంట రాదనీ, అది తాను కాపరానికి వచ్చే నాటికే ఎన్నో తరాలుగా ఆ ఇంటో ఉంటున్న దనీ నాయనమ్మ గోపన్నతో చెప్పేది.

గోపన్నకు పద్దెనిమిది నిండిన కొద్ది రోజులకు నాయనమ్మకు అకస్మాత్తుగా పక్షవాతం వచ్చి పడిపోయింది. ఆవిడ గోపన్నను

కె. ఎల్. నరసింహారావు



దగ్గిరికి పిలిచి, "నాయనా, దేవుడి పళ్లెం జాగ్రత్త! దాని జోలికి పోనని మాట ఇయ్యి!" అన్నది.

గోపన్న ఆమె కోరినట్టుగా మాట ఇచ్చాడు.

"దేవుడి అనుమతి అయితే తప్ప దాన్ని అమ్మవద్దు, ఇల్లు దాటి పోనీవద్దు!"

గోపన్న జవాబు చెప్పే లోపుగా నాయనమ్మ ప్రాణాలు విడిచింది.

ఆ రాత్రంతా గోపన్న నాయనమ్మకోసం ఏడిచాడు. అవిడ తప్ప మరొక తల్లిని వాడెరగడు. పోయినవారికోసం రోజుల తరబడి ఏడవటం సంపన్నులకు జరుగుతుంది గాని పేదవాళ్లకి జరగదు. గోపన్న మరునాడే మళ్లీ బండీ కట్టాడు. ఎందుకంటే తాను ఏరోజు సంపాదించకపోతే ఆ రోజు నలుగురు ప్రాణులకు పస్తే.

నాయనమ్మ పోయాక వాడికి లోకం చిన్నబోయినట్టే ఉంది. కిరాయికి బండిని తోలుకుపోయి ఇంటికి తిరిగివచ్చి బండి విప్పగానే ఒక మూల చేరి తన కుక్కను కావిలించుకుని నాయనమ్మకోసం ఏడిచేవాడు.

నాయనమ్మ చనిపోయాక ఇంటి పెత్తనం ఆడపిల్లలదయింది. వాళ్లను అదుపులో ఉంచటానికి నాయనమ్మ లేదు. వాళ్లు ఇంటి పని అంతా నిర్లక్ష్యంగా చెయ్యసాగారు.



పిచ్చి పిచ్చి పూసలపేర్లు కొని అవి వేసుకుని కులకసాగారు.

"గోపన్నా, ఈడు వచ్చినవాడవుగదా, ఎవతెనన్నా పనిమంతురాలిని పెళ్లాడి ఇల్లు చక్కబరుచుకో. చిన్న పిల్లలు, నీ చెల్లెళ్లు ఇల్లు నిర్వహించ లేరు," అని గోపన్నకు ఇరుగుపొరుగువాళ్లు సలహా ఇచ్చారు.

"మా చెల్లెళ్లందరికీ పెళ్లి కానివ్వండి, నా పెళ్లికేం తొందర?" అనేవాడు గోపన్న.

నిజానికి గోపన్న తనకు కావలిసిన పిల్లను అదివరకే చూసి పెట్టుకున్నాడు. అయితే ఆ పిల్లను అతను చేసుకునే అవకాశం ఏమాత్రమూ లేదు. ఆమె కుమ్మర్ల



పెద్ద అయిన శివన్న కూతురు పార్వతి. శివన్నకు గోపన్న తరుచు బండి కట్టేవాడు. అందుచేత పార్వతి బాగా ఎరిగిన పిల్లే. ఇద్దరికీ మధ్య మాట్లాడుకునే చనువు లేదుగాని, గోపన్నను చూసినప్పుడల్లా పార్వతి ఎంతో స్నేహంగా నవ్వేది, అతనితో మాట్లాడాలన్న కోరికకూడా కనబరిచేది. తన స్థితి తక్కువ అని గుర్తించి గోపన్నే ఆమెకు పెడపెడగా ఉండేవాడు.

అకస్మాత్తుగా గోపన్నస్థితి మరింత దిగజారిపోయింది. అతని ఎడ్లలో ఒకటి చచ్చింది. రెండవది కాలు విరుచుకున్నది. గోపన్నకు తన రెండుకాళ్ళూ విరిగినంత పని అయింది. ఊళ్ళోవాళ్ళు కొద్దిపాటి సహాయం చేశారు గాని, నిజంగా అతన్ని తన కాళ్ళమీద నిలబెట్టగలవాళ్ళు చూస్తూ ఊరుకున్నారు. కుమ్మర్ల పెద్ద శివన్న గోపన్నచేత అన్ని ఏళ్ళుగా పని చేయించుకుని కూడా చిన్నమెత్తు సహాయం చెయ్యలేదు. గోపన్న ఇంట్లో పాయి రాజని స్థితి కూడా ఏర్పడింది.

ఒకనాటి ఉదయం గోపన్న ఏమి చెయ్యటానికీ తోచక ఇంట్లో కూచుని ఉండగా ఎవరో వ్యాపారస్థుడు వచ్చి, "అబ్బాయీ, మీ ఇంట్లో ఒక పాతపళ్ళెం ఉన్నదట, చూడవచ్చునా?" అని అడిగాడు.



గోపన్న గోడకు వేళ్ళాడే సంచీ చూపాడు. పెద్దమనిషి ఆ సంచీని తీయబోయేసరికి గోపన్న, "దాన్ని ముట్టుకోకండి, మేము తాకనుకూడా తాకం!" అన్నాడు.

వ్యాపారి ఆశ్చర్యంతో, "తాకకపోవట మేమిటి? దాన్ని నేను అయిదు రూపాయలకు కొనుక్కుందామని యింతదూరం వచ్చాను," అన్నాడు.

"అది అమ్మేది కాదు," అన్నాడు గోపన్న తాపీగా.

"గోడకు వేళ్ళాడి ఏమి ఉద్ధరిస్తుంది? ఆఖరుమాట పదిరూపాయలిస్తాను, నష్టమైతే అయింది," అన్నాడు వ్యాపారి.

గోపన్న ఒప్పుకోలేదు. వ్యాపారి వదిలి పెట్టలేదు. యాభైరూపాయలదాకా ఆశ పెట్టాడు. గోపన్నకు శరీరమంతా గగుర్పొడిచింది. ఆ డబ్బుతో ఇంకొక ఎద్దును కొని బండి తోలుకోవచ్చు. అయినా నాయనమ్మ చెప్పిన మాటలు తలుచుకుని, గోపన్న దేవుడి పళ్లాన్ని అమ్మ నిరాకరించాడు. రుసరుసలాడుతూ వ్యాపారి వెళ్ళిపోయాడు.

గోపన్న ఇంట ఉన్న ఆ దేవుడి పళ్ళెం రుద్రమదేవి కాలంనాటిది. అది మేలిమి బంగారంతో చేసినది. ఓరుగల్లును తురకలు ముట్టడించిన కాలంలో ఆ పళ్ళెం అనేక చేతులు మారి గోపన్న తాతముత్తా





తల ఇల్లు చేరింది. వారు దానిని కాకతీయ రాజుల అస్తిగా భావించి ఎంతో భక్తితో మీదుగట్టి ఉంచారు.

ఈ సంగతి ఎలాగో పుకారురూపంలో బస్తీదాకా వచ్చింది. ఆ పుకారు విని ఒక వ్యాపారస్థుడు గోపన్నకు బేరం పెట్టాడు. కాని గోపన్న బేరం పడనివ్వలేదు. ఆ వ్యాపారస్థుడు వచ్చి వెళ్ళినాక అలాటివారే అప్పుడప్పుడూ గోపన్న ఇంటికి వచ్చి దేవుడి పళ్లెం కొంటామని అడగసాగారు. గోపన్న బిళ్ళు బాడుగకు తీసుకుని వాటిని తోలి చాలీ చాలని డబ్బుతో ఒకపూట తింటే ఇంకొక పూట మాడుతున్నాడు; అయినా అతడు దేవుడి పళ్ళెం అమ్మటానికి మాత్రం ఎంతమాత్రం ఒప్పలేదు.

ఈలోపుగా అతనికి పార్వతి దాదాపు రోజూ కనిపిస్తూనే ఉన్నది. ఆమె గోపన్న పెంపుడు కుక్కతో సావాసం చేసింది. అది పార్వతిని చూసినప్పుడల్లా ఆమె వద్దకు పరిగెత్తి తోక ఆడించేది. పార్వతి ఆ కుక్కను ముద్దు చేసేది.

పార్వతికి ఒక గొప్ప ఇంటి మనువు కుదిరినట్టు ఊళ్ళో చెప్పుకోసాగారు. ఈ సంగతి వినగానే గోపన్నలో మిగిలివున్న కాస్త ఉత్సాహమూ ఇంకిపోయినట్టయింది. "పార్వతిని నేను పెళ్ళాడలేకపోయాక ఎవరు పెళ్ళాడితేనేం?" అని అతను తన మనసును సమాధానపరుచుకోవటానికి ప్రయత్నించాడు. ఎందుకంటే, గోపన్న రోజల్లా శ్రమపడినా తానూ, తన చెల్లెళ్ళూ రెండు పూటలా కడుపునిండా గంజి అయినా తాగలేని స్థితిలో ఉన్నారు. శివన్నను చూడబోతే అయన వ్యవహారం మూడు పూవులూ ఆరు కాయలూగా ఉన్నది. బస్తీలో ఉండే వ్యాపారస్థులకుకూడా ఆయన అప్పులు పెట్టి మంచి వడ్డీ సంపాదిస్తాడని చెప్పుకునేవారు.

ఆ యేడు పంటలు బాగా పండాయి. పొలాలు ధాన్యలక్ష్మితో కళకళలాడాయి.



కాని గోపన్న ఇంటి పరిస్థితి కరువు పరిస్థితి గానే ఉంది. నాయనమ్మ చావుతో ఇంటికి అరిష్టం చుట్టుకున్నట్టయింది. అన్ని కష్టాలకూ తోడుగా గోపన్న పెద్ద చెల్లెలు జబ్బుపడి మంచాన తీసుకున్నది. గోపన్న ఇంటి పనికూడా చూడవలసి వచ్చింది. "ఈ కష్టాలను దేవుడి పళ్ళెం ఎందుకు నివారించ లేదో!" అనుకున్నాడు గోపన్న.

ఒకనాడు శివన్న గోపన్నను బండి కట్టుకు రమ్మన్నాడు. అతను ఆ రోజు బస్తీకి చాలా మట్టిపాత్రలు చేర్చవలసి ఉంది. ఆ పనితో బాటు గోపన్నకు ఇంకొక పనికూడా తగిలింది. శివన్న గోపన్న చేతికి ఒక రూపాయల సంచీ ఇచ్చి, "ఈ డబ్బును బస్తీలో ఫలాని వర్తకుడికి ఇచ్చి సొమ్ము ముట్టినట్టు అతడి దగ్గరనుంచి రసీదు పట్టుకురా. నువు నమ్మకస్తుడివి గనక ఈ పని నీకే వప్పగిస్తున్నాను!" అన్నాడు.

తనపై శివన్నకు ఈపాటి నమ్మకం ఉన్నందుకు గోపన్న చాలా సంతోషించి, బండినిండా కుండలు పేర్చుకుని, తన కుక్కతోసహా బస్తీకి బయలుదేరాడు. అతను కుండలివ్వవలసినవారికి కుండలు ఇచ్చేసి, బండి తోలుకుని వర్తకుడి ఇంటికి వెళ్లేసరికి మధ్యాన్నమయింది. గోపన్న బండి నుంచి ఎద్దులను విప్పి, వాటికి తన కుక్కను కాపలి పెట్టి వర్తకుడి ఇంటిలోపలికి వెళ్ళాడు. వర్తకుడు ఆ పనీ యీపనీ చూసుకుంటున్నందువల్ల డబ్బు తీసుకుని రసీదివ్వటం కాస్త ఆలస్యమయింది.

గోపన్న మళ్ళీ బయటికి వచ్చి చూసేసరికి కుక్కలేదు, బండీ, ఎద్దులుకూడా లేవు. "వీధిలో కుక్కలను పట్టుకుపోతారు. ఈ బస్తీసంగతి నీకు తెలియదా?" అని వీధిలోవాళ్ళు చెప్పారు.

గోపన్నకు మిన్ను విరిగి మీద పడ్డట్టయింది. "నా బండీ, ఎద్దులూ ఏమయాయి?" అని అతను అడిగాడు.

"ఇంతకు మునుపే ఎవరో పట్టుకు పోయారు!" అని వీధిలోవాళ్ళు అన్నారు.

గోపన్నకు బండీ, ఎద్దులకన్న కుక్క పోవటమే చాలా బాధ కలిగించింది. దాన్ని ఎక్కడికి తీసుకుపోయారో తెలుసుకుని అక్కడికి పరిగెత్తాడు. అది ఒక కచేరీ. అక్కడివాళ్ళను గోపన్న బతిమాలుకుంటూ తన కుక్కను తనకు తిరిగి ఇమ్మన్నాడు.

"అది నీకుక్కా! అయిదురూపాయలు చెల్లించి దాన్ని తీసుకుపో. కుక్కను విడిపించటానికి రెండురూపాయలు, పట్టుకున్న వాణ్ణి అది కరిచినందుకు మూడురూపాయలు జరిమానా!" అన్నారు అధికారులు.

వేసవి ఎండ నెత్తి మాడ్చుతున్నది. గోపన్న పొద్దున లేచి పచ్చి మంచినీళ్ళు కూడా తాగలేదు. అయినా అతను తన గ్రామానికి పరిగెత్తుకు వెళ్ళి శివన్న ఇల్లు చేరి, "శివన్న బాబూ! మీరే రక్షించాలి!" అని ఆర్తనాదం చేశాడు.

గోపన్న డబ్బుసంచీ పారేసి ఉంటాడని శివన్న కంగారుపడి గోపన్నను తిట్టసాగాడు. గోపన్న ఇచ్చిన రసీదు చూశాక ఆయనకు మనస్సు కుదటపడింది.

"చవటవెధవా, ఏమీలేనిదానికి ఊరికేనే కంగారుపెట్టా వెందుకు?" అన్నాడు శివన్న కోపంగా.



"బాబూ, నా కుక్కను పట్టుకున్నారు. అయిదురూపాయ లిప్పించండి. సాయంకాలం లోగా సొమ్ము చెల్లించకపోతే ఈ రాత్రికి నా కుక్క నిష్కారణంగా చచ్చిపోతుంది. మీ రుణం ఏదోవిధంగా తీర్చుకుంటాను!" అని గోపన్న కళ్ల నీళ్ల పర్యంతమై బతిమాలాడు.

"నీ వెధవ కుక్కకోసం పారెయ్యటానికి నాదగ్గిర డబ్బు లేదు. అది కాకపోతే ఇంకో కుక్కను పెంచుకో!" అన్నాడు శివన్న.

గోపన్న తూలుతూ బయటికి వచ్చాడు. వాడికి భగవంతుడిలో ఉన్న అపారమైన విశ్వాసం ఇగిరిపోసాగింది. అతనికి దేవుడి పళ్లెం అకస్మాత్తుగా జ్ఞాపకం వచ్చింది. దేవుడు అనుమతిస్తే ఆ పళ్లెం అమ్మమని నాయనమ్మ చెప్పింది. దేవుడు తప్పక అనుమతిస్తాడు! ఇటువంటి సమయంలో అదుకోవటానికి కాకపోతే ఆ పళ్లెం దేనికి? అతనికి దేవుడిలో నమ్మకం తిరిగి వచ్చింది.

తాను ఇంటికి వెళ్లటమూ, గోడమీది నుంచి దేవుడి పళ్లెం దించటమూ, దాన్ని పట్టుకుని తిరిగి నగరానికి వెళ్లటమూ, అక్కడి వ్యాపారిదగ్గిరికి వెళ్లి, "ఇదుగో దేవుడి పళ్లెం! యాభై రూపాయలూ ఇవ్వండి!" అని అడగటమూ గోపన్నకు కలలో విషయాలలాగా ఉన్నాయి.



అతని చేతిలోని దేవుడి పళ్లాన్ని వ్యాపా రస్థుడు తీసుకునేలోపల అక్కడ ఉన్న మరొక పెద్దమనిషి దాన్ని తీసుకుని, " దీని ఖరీదు యాభైరూపాయ లేమిటి? ఇంకా చాలా ఉంటుందే!" అన్నాడు.

"యాభైరూపాయలు చాలు, ఇవ్వండి!" అన్నాడు గోపన్న.

ఆ పెద్దమనిషి యాభైరూపాయలూ ఎంచి ఇచ్చాడు. గోపన్న తూలుతూ వెళ్లి, అయిదు రూపాయలు తీసి అధికార్ల కిచ్చి తన కుక్కను విడిపించుకున్నాడు. ఆ కుక్కను కౌగలించుకుంటూ ఉండగానే అతనికి స్పృహ తప్పిపోయింది.

గోపన్నకు మళ్లీ స్పృహ తెలిసేసరికి అతను తన ఇంటో ఉన్నాడు. మరి కాస్సేపటికల్లా, తనదగ్గిర పళ్లెం తీసుకున్న పెద్దమనిషి అక్కడికి వచ్చాడు. ఆయన గోపన్నతో, " ఈ పళ్లాన్ని నువు అవసరం వచ్చి అమ్మావా, నాయనా ?" అని అడిగాడు.

" అవునండి !" అన్నాడు గోపన్న.

" దీని ఖరీదెంతో నీకు తెలియదా ?" అన్నాడు పెద్దమనిషి.

"దాని ఖరీదు సంగతి నాకేమీ తెలి యదు," అన్నాడు గోపన్న.

" ఇది చరిత్రప్రసిద్ధి గల పళ్లెం. దీని ఖరీదు కనీసం పదిహేనువందల రూపాయ లుంటుంది. ఇదుగో మిగిలిన సొమ్ము !" అంటూ ఆ పెద్దమనిషి రూపాయల సంచీ తీసి గోపన్న ముందు పెట్టాడు.

ఆ రోజునుంచీ గోపన్న అదృష్టం తిరి గింది. అతను ఆ గ్రామంలో ఒక ధనికు డైనాడు. పొలాలు కొనుక్కుని, మంచి ఇల్లు కట్టుకున్నాడు. పార్వతి గోపన్నను తప్ప ఇంకెవరినీ పెళ్లాడనని తన తండ్రితో అన్నప్పుడు ఆయన అభ్యంతరం చెప్పలేదు. ఇద్దరికీ పెళ్లిఅయి ఊరేగింపు జరిగినప్పుడు గోపన్న కుక్క ఊరేగింపుతోబాటు గర్వంగా ముందు నడిచింది.





# ప్రకృతి వింతలు

దక్షిణ అమెరికాలో ఎమెజాన్ అనే నది ఉన్నది. ఎమెజాన్‌కు ఉపనది అయిన అరాగ్వయా పైన ఒకనాడు ఒక బోటులో కొందరం ప్రయాణం చేస్తున్నాము. ఇది చాలాదురుసైన నది.

ఇప్పుడు దీని ప్రవాహం చాలా పూటు మీద ఉండి ఒడ్డులను చెట్లతోసహా విరిచేసి తనవెంట తీసుకుపోతున్నది.

బోటు పైభాగంమీద ఉండి చూస్తున్న వాళ్లు అకస్మాత్తుగా, "జాగ్వార్, జాగ్వార్!" అని కేకవేశారు. జాగ్వార్ ఒక రకమైన పులి. దక్షిణ అమెరికా అరణ్యాలలో దాని కన్న పెద్దజంతువూ క్రూరమైన జంతువూ మరొకటి ఉండదు.

ఈ కేక విని బోటుదిగువను ఉన్నవారు కూడా పైకి వచ్చి చూశారు. ప్రవాహం వాలున కొట్టుకుపోతూ మాకొక చిన్న లంక కనిపించింది. దానిపైన కొన్ని పొదలూ, ఒక జాగ్వార్ పులీ ఉన్నాయి. అరణ్యంలో సంచరించే జాగ్వార్‌లు చాలా ఠీవిగా, భయం గొలిపేటట్టుగా ఉంటాయి, కాని ఈ పులి అలా లేదు. నల్లమచ్చలు గల దాని పచ్చని శరీరమంతా తడపటంచేత అది నీళ్లలో నుంచి బయటికి వచ్చిన పిల్లిలాగా ఉంది. అది ప్రాణం కాపాడుకునేటందుకు పొదలను పట్టుకుని ఉండి, ప్రవాహానికి ఎదురు వెళ్లే బోటుమీది మనుషులకేసి తనను ఎలాగైనా రక్షించమన్నట్టుగా చూసింది.

కాని దాన్ని ఎవరు రక్షించగలరు? కొట్టుకుపోయిపోయి ఆ లంక నీటిలో నాని ముక్కలు ముక్కలుగా విరిగిపోతుంది. జాగ్వార్ ఒడ్డుకు ఈదగలిగిందా సరేసరి, లేకపోతే అది నదికి బలికాక తప్పదు...

జాగ్వార్ కనుచూపుమేర దాటిపోయి, ప్రయాణీకులం కిందికి దిగివెళ్లేలోపల బోటు దేనికో బలంగా ఢీకొన్నట్టయి, ఊగిపోయింది.

తిబోర్ సెకెల్యే





అయింది. స్త్రీలూ, పిల్లలూ ఆర్తనాదాలు చెయ్యసాగారు. ఈ భీభత్సంమధ్య బోటు కాప్టెన్ మెగాఫోన్ అనే గొట్టంలోనుంచి గట్టిగా అరుస్తూ, "ప్రయాణీకులారా, కంగారు పడకండి! ఏమీ అపాయం లేదు. మనవెంట తేలికపడవ ఒకటి ఉన్నది. దానిమీద అందరినీ క్రమంగా ఒడ్డుకు చేరుస్తాము. మీరు అనవసరంగా కేకలుపెట్ట వద్దు, మీలోమీరు దొమ్మిగా తోసుకోవద్దు!" అని తెలియజేశాడు.

కాప్టెన్ ఈమాట లన్నందువల్లనైతేనేం, తేలికపడవను నావికులు నీటిలోకి దించుతూండటం కళ్లపడినందువల్లనైతేనేం, ప్రయాణీకుల కంగారు కొంత శాంతించింది. మొట్టమొదట నలుగురు తల్లులూ, వారి పిల్లలూ పడవలో తీరానికి చేర్చబడ్డారు. తరవాత బోటులో మిగిలిఉన్న స్త్రీలు వెళ్లారు. తరవాత మగవాళ్లవంతు వచ్చింది. ఆ బోటులో మొత్తం సుమారు ముప్ఫై మంది ఉన్నారు. ఇంతమందినీ ఒడ్డుకు చేర్చటానికి ఒక గంట పట్టింది. అందరం ఒడ్డు చేరినాక బోటు కాప్టెనూ, నావికులూ ఇవతలికి వచ్చేశారు.

అందరం నది ఒడ్డున నిలబడ్డాము. మా చుట్టూ అరణ్యం ఉన్నది. చెట్లనుంచి

పైనఉన్న ప్రయాణీకులు తూలిపోయారు, కొందరు కింద పడిపోయారుకూడా. బోటు నిలిచిపోయింది. దాని అడుగుభాగం దేనికో రాచుకుంటున్నట్టుగా గర్రుమని చప్పుడు వినబడింది. ప్రయాణీకులు హాహాకారాలు చేస్తూ, భయోద్రేకంతో అటూఇటూ పరిగెత్తుతూ, ఒకరినొకరు తోసుకోసాగారు. కొందరు కిందికి దిగుతుంటే కిందినుంచి కొందరు పైకి పరిగెత్తసాగారు. అంతలో ఎవరో, "మనం మునిగిపోతున్నాం!" అని కేకపెట్టారు.

చూస్తుండగానే నీరు బోటు పైభాగానికి వచ్చింది. ప్రయాణీకులలో కంగారు జాస్తి



అంతులేని ఊడలు దిగి ఉన్నాయి. మా కెదురుగా నదిమధ్యను బోటు తాలూకు ముందుభాగం నీటిమీదుగా పొడుచుకు వచ్చిఉన్నది. నీటి అడుగున మునిగిఉన్న చెట్టు బోదెకు రాచుకుని బోటు చిల్లిపడి మునిగింది. అయితే అది సాంతం నీటిలోకి దిగిపోకుండా ఆ చెట్టుబోదే ఆపింది.

ప్రయాణీకులం చాలా దీనస్థితిలో వున్నాము. మా సామానులన్నీ బోటులో ఉండిపోయాయి. మేము చిక్కుపడిపోయి నది అంతులేని కీకారణ్యంమధ్య. మేం తినటానికి ఆహారం యేమీలేదు. మమ్మి ఉత్సాహపరచటానికి కాప్టెన్, "బోటులో నుంచి కొంతసామాను తీసుకురావటానికి రేపు ప్రయత్నించుదాం. సాధ్యమైతే బోటునుకూడా పైకి లాగి దానిలో పడిన కంతలు పూడుస్తాం. కొద్దిరోజులలో మనం ప్రయాణం కొనసాగించవచ్చు," అన్నాడు. ఈ మాటలలో ప్రయాణీకులకు పూర్తి విశ్వాసం కుదరలేదు గాని, వారి అందోళన కొంత తగ్గింది.

మేము మా అడవికత్తులతో చిన్నచిన్న చెట్లూ, పొదలూ నరికి కొంతమేర బాగుచేసుకున్నాము. దానిమధ్య పెద్ద మంటచేశాము. దానిచుట్టూ దుంగలు వేసుకుని వాటిపైన కూర్చున్నాము. కొందరు తమ తడిబట్టలనూ,



తడిసిన శరీరాలనూ మంటల సహాయంతో ఆరబెట్టుకున్నారు.

అప్పటికి సాయంకాలమవుతున్నది. ఆ రాత్రి మాకు తిండి వుండదు. ఆ విషయం తట్టగానే కొందరికి అప్పుడే భరించరాని ఆకలి ఆరంభమయింది.

అరణ్యంలోనుంచి రకరకాల అరుపులూ, కూతలూ వినిపిస్తున్నాయి. అందులో చాలా రకాల ప్రాణులు వుండివుండాలి. ఈ మోత లన్నిటిలోకీ ఒక పక్షికేక కొట్టవచ్చినట్టు స్పష్టంగా మాకు తెలియవచ్చింది. ప్రయాణీకులం విడిసిన చోటికి సమీపంలోనే అది ఎగురుతూ అరవసాగింది.

"నాకా అరుపు బాగా తెలుసు. అది అడవి కోడి," అన్నాడొక ప్రయాణీకుడు.

ఇంతలోనే అది వచ్చి, ప్రయాణీకులకు యెగువగా వున్న ఒక చెట్టుకొమ్మ మీద వాలింది. దాని బరువుకు కొమ్మ ఊగింది. పక్షి చాలా ఏపుమీద వున్నది. దాని ఈకలు గోధుమరంగుగా వుండి, మధ్య మధ్య తెల్లని చారలున్నాయి.

"ఎవరిదగ్గిరనైనా తుపాకీ వుంటే దాన్ని కొట్టి ఈ రాత్రికి అందరమూ తిందుము!" అన్నాడొక ముసలాయన. కాని ఎవరివద్దా తుపాకీ లేదు. అందుచేత అందరమూ దిగులుగా కూచున్నాము.

అకస్మాత్తుగా గాలిలో బుస్సుమని శబ్ద మయింది. చెట్టుకొమ్మపై కూచునివున్న అడవికోడి అరిచి, తన్నుకుంటూ మంటలో పడిపోయింది. ఈ అనుకోని సంఘటనకు అందరూ నిశ్చేష్టులయారు. ఏమి జరిగినదీ ఎవరికీ అర్థంకాలేదు.

అంతలోనే మాకు నవ్వు వినిపించింది. అందరమూ ఉలిక్కిపడి నవ్వు వినిపించిన దిక్కుగా చూశాము. ఒక చెట్టుమీదినుంచి దిగుతూ మాకొక ఇండియనుజాతి కుర్ర వాడు కనబడ్డాడు. వాడి చేతిలో విల్లూ బాణాలూ వున్నాయి. (ఇంకా వుంది)



# ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1958 సెప్టెంబర్ సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాక్యలకూ సంబంధం వుండాలి.)

★ జూలై నెల 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:-చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

---

## జూలై నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : తల మునిగి...

రెండవ ఫోటో : తాటి ప్రమాణము!

పంపినవారు : బి. అంజనేయశాస్త్రి, C/o భాగవంతుల అన్నపూర్ణయ్య శాస్త్రిగారు, శ్రీవారి సన్నిధి, తెనాలి - (గుంటూరు జిల్లా.)

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# చిత్రకథ





ఒకరోజున దాసూ, వాసూలు పార్కులో ఆడుకుంటున్నారు. ఆ సమయంలో వాళ్ళు పుస్తకాల పక్కన పెట్టుకున్న బిస్కెట్ల పొట్లాన్ని ఒక పెద్ద కుక్క నోట కరుచుకుని అవతలికి పరిగెత్తింది. ఆ కుక్క సొంతదారైన కుర్రాణ్ణి దాసూ వాసూలు అడిగితే, 'చేతనైతే మీ టైగర్‌చేత నా కుక్కతో పోట్లాడించి, పొట్లాం తెచ్చుకోండి!' అన్నాడు. ఈలోపల 'టైగర్' వెళ్లి ఆ పెద్ద కుక్క తోక పట్టుకున్నది. అది బిస్కెట్ల పొట్లాం వదిలి 'టైగర్' వెంట బడేసరికి, టైగర్ అక్కడ వున్న కొయ్యపలకమీదుగా పరిగెత్తింది. వెంటబడిన పెద్దకుక్క నెత్తిన కొయ్య పలక రెండోచివర దభీమంటూ పడేసరికి, అది కుయ్యోమంటూ కూలబడింది.






Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by him for Chandamama Publications, from Madras 26.—Controlling Editor : SRI 'CHAKRAPANI'

# THE CHOICE
# Pencils




**AJANTHA**
BLACK LEAD

**EMBESEE**
BLACK LEAD

**IMPERIAL**
COPYING

**ACCOUNTANT**
COLOUR

**CHECKING**
COLOUR

**SPECTRUM**
12, COLOURS

*Manufactured by*
**THE MADRAS PENCIL FACTORY**

3, STRINGER STREET,
MADRAS.

# దీనిని చదివితే మీరు ఆశ్చర్యపడతారు...




మొక్కలు పురుగులను తింటాయని మీరు నమ్ముతారా ? ఈ చిత్రములో నున్నది దక్షిణ అమెరికా యందలి "మోహిని ఈగబోను" అనేమొక్క, ఈ చిత్రమునందు 1 వ నంబరులో, ఈగ వస్తున్నది; 2 వ నంబరులో, అది ఆకు మీద కూర్చున్నది; 3 వ నంబరులో, ఆకులు ఆ ఈగ మీద ముడుచు కొంటున్నాయి; 4 వ నంబరులో, ఈగ మ్రింగివేయబడింది.



రెక్కలులేని ఈ రెండు ఈగలను చూడండి!

రెక్కలులేని ఈగలకంటె రెక్కలున్న ఈగలు వ్యాధులను అతివేగంగా చాలా దూరం వ్యాపింపజేస్తాయి. మురికికూడా ఈగల్లాగే వ్యాధిని వ్యాపింప జేయగలదు. మీరేమి చేస్తున్నా మురికి కాకుండా తప్పించుకోలేరు, ఇంక మురికిలో మీ ఆరోగ్యానికి ఎడతెగని ప్రమాదమైనట్టి వ్యాధిని గలిగించే క్రిములున్నాయి.




లైఫ్‌బాయ్ సబ్బుతో ఈ క్రిములను కడిగివేసి మీ ఆరోగ్యమును కాపాడుకోండి. ఎల్లప్పుడూ లైఫ్‌బాయ్ సబ్బుతో స్నానము చేయండి. అది మంచి అలవాటు.

L. 282-50 TL

హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ బొంబాయి.










MANNERS
GRIPE MIXTURE
MANNERS

